


సతీష్‌కపూర్  విద్యాసాగర్  కె.సుభాష్

JAGATI Rs. 2-00 December 1992

38th Year of Publication




136

437

డిసెంబరు - 1992

## సాహితీ సుధ

ఒకయెడ బవ్వళించు హరి యొక్క యెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడగు బర్వతసంఘము లొక్కెడన్ బలా
హకముల తోడ నుండు బడబాగ్నియు విస్తృత మూర్జితంబునుం
బ్రకటరక్షమం బగుచు భాసిలు నౌర సముద్ర మెంతయున్

—భర్తృహరి



బావా ! యెప్పుడు వచ్చితీవు ? సుఖులే భ్రాతల్సుతు ల్చుట్టముల్ ?
నీ వాల్లభ్యము పట్టు కర్ణుడును మన్నీలున్ సుఖోపేతులే ?
మీ వంశోన్నతి గోరు భీష్మండును మీ మేల్గోరు ద్రోణాది భూ
దేవుల్ సేమముమై నెసంగుదురె ? నీ తేజంబు హెచ్చించునన్

—తిరుపతి వేంకట కవుల 'పాండవోద్యగము'



తన వారు లేని చోటను - జనమించుక లేని చోట జగడము చోటన్
అనుమానమైన చోటను - మనుజునకును నిలువ దగదు మహిలో సుమతీ !

—సుమతీ శతకం

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు : అ॥ డాలర్లు 75.

ముఖచిత్రం : ఇందిరా గాంధీ

# నిమ్మతోనలు



అనూరాధా డియర్, ఏమిటి యివాళ పాయసం, పులిహోర, గుత్తి వంకాయకూర, పెరుగు గారెలు, ముక్కల పులుసు, గడ్డపెరుగు - అంతా మరీ స్పెషల్‌గా ఉన్నదే' - అన్నాడు చిదంబరం భార్యతో.

'ఈసారి సంక్రాంతి కథల పోటీలో ఫస్ట్‌ప్రయిజ్ నాకు ఖాయం.... కాస్త సరిచూసి యిస్తే, యివ్వాళే పంపించేస్తాను' - అని చెప్పింది అనూరాధ.

'భుక్తాయాసం తీరాక, అలాగే !'

'కథ కాపీ చేయాలి కదండీ, పోస్ట్ టైము అయిపోతుంది'

'అవును, అదీ నిజమే - కథ పట్టుకురా' - అన్నాడు చిదంబరం.

పక్కగదిలోకి వెళ్లి వచ్చిన అనూరాధ గాభరాగా, "ఏమండీ యిందాక ఈ టేబుల్ మీద పెట్టాను ఇరవై తావుల కథ - ఏమైపోయిందండి ?' - అంది.

'పదిగంటలకి పాతపేపర్లు అమ్ముతున్నప్పుడు వాటితో వెళ్లిపోలేదు కద !' - అని చిదంబరం అనేసరికి, కుప్పకూలిపోయింది అనూరాధ.

—బిఆర్ మూర్తి
మచిలీపట్నం-2

ఆశ్వయుజ పూర్ణిమనాడు బెంగాల్లో, లక్ష్మీపూజ ఘనంగా చేస్తారు. ఆ రోజు ఉదయం తొమ్మిది గంటలకు డోర్‌బెల్ మోగేసరికి తలుపు తీసిన నేను ఎదురుగా నిలబడ్డ అపురూప సౌందర్యవతిని చూసి, లక్ష్మీదేవి నిజంగా మా యింటి ముంగిట ప్రత్యక్షమయిందా అనుకున్నాను.

'నా పేరు శ్యామల - మీ యింట్లో ఏదైనా పని యిప్పిస్తారా?' అంది ఆమె.

'పొరబాటున మా బెల్ కొట్టారేమో - ఫిలిమ్‌స్టార్ సావిత్రీ చటర్జీ దీనికి పై అంతస్తులో ఉన్నారు' - అన్నాను.

'నేను బెంగాలీ వారింట్లో పని చేయను' - అంది.

ఆమె జార్జెట్ చీరె, కట్టు బొట్టు, హాండ్‌బాగ్, అలంకారం చూసి 'మీకు యివ్వగల పనేమీలేదు మా యింట్లో' - అన్నాను నెమ్మదిగా.

రివ్వున వెళ్లిపోయిన ఆ శ్యామల రెండునెలలు పోయాక కూరల మార్కెట్‌లో కనిపించి చెప్పింది: 'అంతా సెటిల్ అయిపోయింది, మేడమ్. ఆ సాయింత్రం ఏడుగంటల దాకా యింటికి వెళ్లలేదు. నేను గుమ్మంలో కనిపించగానే, ఆయన వన్ను పట్టుకు

ఘోరున ఏడ్చేసి, క్షమించమన్నారు - నేను క్షమించేశాను'.

—బులుసు శారద
కలకత్తా-53

ప్రముఖ శాస్త్ర వేత్త డా॥ నాయుడమ్మగారు, ఆయన మిత్రులు గంగాధరగౌరి ఒక సభలో ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

నాయుడమ్మగారు మాట్లాడుతూ, 'ఆడపేర్లుగల యిద్దరు మగవాళ్లం, ఈ సభలో వున్నాం. ఆడపిల్లలు లేనందున మా అమ్మమ్మ నాపేరుకి 'అమ్మ' కలిపింది. మిత్రులు గంగాధర గౌరిలోని గౌరి శబ్దం కూడా స్త్రీ నామ ధేయమే!' అనగా, సభ నవ్వులలో మునిగింది.

—జానమద్ది
కడప-4

ఇద్దరు మిత్రులు ప్రేమ వ్యవహారాలు సంప్రదించుకుంటున్నారు.

'రాజూ, నేను ఆమెని మనసారా ప్రేమిస్తున్నాను' - అన్నాడు గోపాలం.

'ప్రతి ప్రేమా మనసుతో నే ప్రారంభ మవుతుంది - కాళ్లతోనూ చేతులతోనూ కాదు. ఇంతకీ ఆమె ఎవరు?' - అని రాజు ప్రశ్న.

'ఆమె పేరు సునంద'

'కాలేజీ గరలా ?'

'కాదు. మెడికల్‌షాపులో పని చేస్తోంది. ఆమెకి మాత్రమే అర్థం అయేటట్టు, ఒక ప్రేమలేఖ రాద్దా మనుకుంటున్నాను. నాకు అంత బాగా రాయడం చేతకాదు. నువ్వు రాసి పెట్టవ్' - అని అర్థించాడు గోపాలం.

'నీవు ప్రేమించిన అమ్మాయికి నేను ప్రేమలేఖ రాసిపెట్టడమా ?'

'అవును, తప్పేముంది ? నేను రాసినట్టు నీవు రాయడం....'

'కరక్టే, బ్రదర్. ఆమె మెడికల్ షాపులో కదా పని చేస్తున్నది. నాలాంటి బాంకు వుద్యోగిని గాక, ఎవరైనా డాక్టరుని పట్టుకు రాయిస్తే, ఆ వ్రాత ఆమెకి తప్ప, మరెంకెవరికీ బోధపడదు.'

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

# పాఠకుల తీర్పు

ప్రియ మిత్రులు చందూర్‌గారికి : నమస్కారములు. తల్లా ప్రగడ ప్రకాశరాయడుగారి ఆత్మకథ 'నా రాట్నచక్రం', సీరియల్‌గా ప్రచురిస్తున్నందుకు, మిమ్మల్ని అభినందించకుండా వుండలేను.... ఆయన జీవించి ఉండగా కలుసుకొని మాట్లాడే భాగ్యం నాకు కలిగింది. ఆయనతో నేను జరిపిన యింటర్వ్యూ, ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో, ముద్రించారు. కేసరిగారి లాగానే, తల్లాప్రగడ వారు కూడా, కొన్నిటిని నిశితంగా వ్యాఖ్యానించారు... వెనకటి సెంట్రల్ ప్రావిన్సెస్‌లో పెద్ద ఉద్యోగాలు చేసిన పెండ్యాల సత్యనారాయణ రావుగారూ (పియస్ రావు ఐసియస్), తల్లా ప్రగడ ప్రకాశరాయడుగారు బాల్యం నుంచీ ప్రాణమిత్రులు. ఇద్దరూ 90 ఏళ్లకు పైగా జీవించారు. విద్యాధికులేగాక మేధావులు.

—డి రామలింగం
హైదరాబాదు-44

ప్రియ మిత్రులకు వందనములతో వ్రాయునది. బాపూజీ చిత్రము (92 అక్టోబరు నెలది) ఆధునిక భారతీయ చిత్రకళా విభాగంలో ఒక మణిపూస వంటిది. దండీయాత్ర ఉదంతాన్ని దృష్టిలో ఉంచుకొని నందలాల్ బోసు తయారు చేసిన లైనో కట్ ప్రింటు — అసలు మూలప్రతి నలుపు, తెలుపు రంగుల్లో! ఆ ద్విపర్ణ చిత్రము అప్పటి నుండి ఇప్పటి వరకు బహుళ ప్రచారంలోకి వచ్చిన గ్రాఫిక్ ప్రింట్.... మీరు నీలము, తెలుపురంగుగా ప్రచురించారు — భేష్! అద్వితీయంగా ఉంది.... చిత్రకళ అంటే మీకున్న అభిరుచికి, ఒక బంగారుకలకు అద్దం పట్టినట్లు వుంది.

—పియల్ నరసింహమూర్తి
మద్రాసు-94

చందూర్‌గారికి నమస్కారం. ఇంత తక్కువ ధరకి యింత మంచి పత్రికని యిస్తున్న మీరు అభినందనీయులు. నిమ్మతొనలు, వెన్నెల కెరటాలు, చిత్ర సమీక్షలు ప్రతి శీర్షిక మమ్మల్ని ఆకట్టుకుంటున్నది.

—బి అరుణ్‌కుమార్
గరుగుబిల్లి

యన్నార్ చందూర్‌గారికి ; నమస్కారములు. చాలా కాలంగా నేను మీ ఫాన్‌ని. ముఖ్యంగా 'డైరీ' నాకెంతో యిష్టం. మీరు చూస్తున్నవి, తెలుసుకుంటున్నవి పాఠకులకి చెప్పే ఆ రచనాశైలీ ప్రశంసనీయం.

—ఆర్ మాధవి
విజయవాడ-2

## తిరుపతి వేంకట కవులు

పుంభావ సరస్వతులైన తిరుపతి వేంకట కవులు - దివాకర్ల తిరుపతి శాస్త్రి, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారల జంట. ఒకరిది భీమవరం సమీపం లోని ఎండగండి, రెండవవారి జన్మ స్థలం ఫ్రెంచి యానాం. అడవిలోని ఉసిరికాయ, సముద్రపుటుప్పు కలిసిన విధంగా వారు బ్రహ్మగురు సన్నిధిని కలిశారు. షట్కర్మనీవేదియైన చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి వద్ద వారు భాష్యాంతం వ్యాకరణం పఠించారు. ధాతవలె చర్లవారు సాహిత్య జగత్కళ్యాణం కొఱకు శిష్యుల నిద్దరినీ జంటగా కవితాగానం గావింపుడని ప్రోత్సహించారు. వెంకటశాస్త్రిగారు గోణము కట్టుటాది కోమల కవిత చెప్పనేర్చారు. వారే తిరుపతి శాస్త్రి గారికి కవితామర్మాలను, ఒడుపులను తెలిపి వారిని నిర్దిష్టమైన కవిత చెప్పే విధంగా తీర్చిదిద్దారు. అందువల్లనే తిరుపతి శాస్త్రిగారు వెంకటశాస్త్రి గారిని గురుస్థానంలో ఉంచుకొనిరి.

—ఆర్ ఏకాంబరాచార్యులు
'స్రవంతి'లో

## మాగ్నా కార్టా

ఆ పత్రం పుట్టేవరకు రాజు సర్వ స్వతంత్రుడు. ఆయన అధికారం మీద హద్దులు లేవు. ప్రజలకు హక్కులూ లేవు. ఆ పరిస్థితుల్లో ఇంగ్లండు రాజులు చండశాసనులు కావడంలో ఆశ్చర్యం లేదు ... ప్రజలు రాజుకు ఎదురు తిరిగారు. ప్రజలంటే భూస్వామ్యతత్వం పాతుకు పోయి ఉండడం చేత భూస్వాములు, జమీందారులు ప్రజావళి కింద లెక్క .... జాన్ రాజు తలవంచక తప్ప లేదు. అప్పుడు తన సామంతులతో క్రీ.శ. 1212లో ఒప్పందం కుదుర్చు కున్నాడు. రాజ్య పరిపాలనలో కొన్ని హక్కులు ఇవ్వడానికి అంగీకరించాడు. ఆనాటి నుండి ప్రజాస్వామ్యానికి వేగు చుక్కగా ఆ అధికార పత్రం గుర్తించబడుతోంది. అందుకే దానికి "గొప్ప రాజ్యపత్రం" (మాగ్నాకార్టా) అనే ఖ్యాతి వచ్చింది.

—ఆవుల సాంబశివరావు
'తెలుగు విద్యార్థి'లో

# పాతికేళ్ళ నాటి పిక్చర్

## హంగేరియన్ చిత్రం

## 'సాన్వ్ సాంగ్'

సోషలిస్ట్ దేశాల నుంచి ఎంతకీ తమ ఘనత చెప్పుకొనే ప్రచార చిత్రాలే వస్తాయనే అపవాదు ఒకటి ఉంది. ఏడెనిమిదేళ్ల క్రితం వచ్చిన 'ఆల్బారీగా' అన్ని దేశాల ప్రేక్షకులని విస్మయ పరిచింది - అంత చక్కటి కళాత్మక విలువలు గల చిత్రమది... సామ్యవాద సమాజం పోలీసులంటే, పరమ కిరాతకులనే దురభిప్రాయం ఉంది. మారుతున్న కాలంలో మారలేని మనుషుల పట్ల సానుభూతి కనబరుస్తూ, టీచరు పిల్లలని సరిదిద్దినట్లు, వారిని సక్రమ మార్గాన పెట్టడం తమ వృత్తి నిర్వహణలో భాగంగా భావిస్తుంది అక్కడి పోలీసుశాఖ. అదికూడా ప్రచారమేమోనని కొందరు అనుకోవచ్చు. కానీ ఈ పిక్చరు చూశాక ఆ అపోహ తొలగిపోతుంది. ఏ పద్ధతికి చెందినప్పటికీ ప్రతి దేశంలోనూ వున్న సమస్యే యిది.... తిండి పెట్టని సంగీతమెందుకని తండ్రి తన ఫిడేలు విరిచేసరికి, జితరెస్ట్ జీవితం వంకర తిరుగుతుంది. చెయివాటుతనం మొదలెట్టి, తనలాటి జేబుదొంగలని కూడగట్టుకుంటాడు - వారి స్థావరం పేరు విల్లా నీగ్రెస్. 'నాకు కారులూ మేడలూ వద్దు. పెళ్ళీ పెడాకులు లేవు, పిల్లా జెల్లాలేరు గనక పెన్నిదీ వొద్దు, పెన్షనూ వొద్దు. హాయిగా నన్ను పాడుకోనిస్తే చాలు' - అనుకుంటాడు. చీకూచింతా లేకుండా ఫిడేలు మీద పాడుకోవడం అతని జీవిత ధ్యేయం. సమాజపు పైపొరలని మాత్రమే స్పృశించే సిద్ధాంతాలు, పథకాలు ఈ బడుగువారి దాకా రావు. తమకు తోచిన రీతిలో బతకాలని వీరి అభిలాష. సార్జెంటు కెంతకీ ఈ జితరెస్ట్‌ని, అతని జట్టుని మార్చి, మంచి దారిలో పెట్టాలని! ఇష్ట కడుతున్న చోట పని యిప్పిస్తాడు. అలవాటైన దొంగతనం అక్కడా మానలేక పోతారు జితరెస్టూ. అతని ఫ్రెండూ. దొంగ సరుకులన్నీ తమ విల్లా నీగ్రెస్‌లో చేరుస్తారు. సార్జెంటుకి వీరి చర్యలన్నీ తెలుసు. ఎంతకీ ఈ దారి తప్పిన వారిని దారిలో పెట్టాలనే అతని ప్రయత్నం ఒక మంచిరోజున నగరాభివృద్ధి సంస్థ, విల్లా నీగ్రెస్‌లోని దొంగ వస్తువులు బయట పారేసి, అక్కడ కట్టనున్న టెనెమెంట్స్ కోసం ఆ ప్రదేశాన్ని బుల్‌డోజర్‌తో చదును చేస్తూవుండగా, 'ఇది నా ప్రపంచం కాదు' అని ఫిడేలు చేత బుచ్చుకు వెళ్ళిపోతాడు జితరెస్ట్.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - డిసెంబరు 1967

## మానవ ప్రగతి

### మార్లేన్ డీట్రిచ్

అంతర్జాతీయ చలన చిత్ర రంగంలో దాదాపు అర్ధ శతాబ్దం పాటు గ్లామర్ క్వీన్‌గా వెలుగొందిన జర్మన్ కాబరే సింగర్, నటి మార్లేన్ డీట్రిచ్ తన 90వ ఏట పారిస్‌లో కన్ను మూసింది. జీవితకాలంలో అత్యధిక భాగాన్ని మాతృభూమికి వెలుపల గడిపిన డీట్రిచ్‌ని, మరణానంతరం జర్మనీలోని బెర్లిన్ శ్మశాన వాటికలో ఆమె తల్లి సమాధికి ప్రక్కనే ఖననం చేశారు. 1930 ప్రాంతంలోని మార్లేన్ డీట్రిచ్ సినిమాలు, తన బ్రతుకు తెరువు తాను చూసుకుని, జీవితభాగస్వామిని వెతుక్కునే ఒక స్వేచ్ఛాయుత స్త్రీని కళ్ళముందుంచేవి. "ది బ్లూ ఏంజెల్" చిత్రంలోని కాబరే డాన్సర్ పాత్ర ద్వారా డైరక్టర్ జోసెఫ్ వాన్ స్టెర్న్‌బెర్గ్ ఆమెను ఒక అంతరాతీయ తారగా మార్చారు. డీట్రిచ్ - స్టెర్న్ బెర్గ్‌ల కలయికతో వచ్చిన "మొరాకో" (1930), "డిజానర్డ్" (1931), "షాంఘై ఎక్స్‌ప్రెస్" (1932) చిత్రాలు కూడా డీట్రిచ్‌కి మంచి పేరు తీసుకొచ్చాయి.... మేరే మగ్దలీన్ డీట్రిచ్ 1901లో బెర్లిన్‌లో జన్మించింది. తండ్రి ఒక ప్రష్యన్ పోలీసు అధికారి; తల్లి ఒక నగల వ్యాపారి కుమార్తె. తొమ్మిదేళ్ల వయసప్పుడు ఆమె తన తండ్రిని కోల్పోయింది. బాల్యంలో వయొలిన్ పాఠాలు నేర్చుకుంది. అయితే 18వ ఏట చేతికి గాయం తగలడంతో, వయొలిన్‌ని విడిచిపెట్టి నటన మీదికి దృష్టి మళ్లించింది. అటు పిమ్మట రుడాల్ఫ్ సీబెర్ అనే ఒక అసిస్టెంట్ ఫిలిం డైరక్టర్‌ని వివాహం చేసుకుని, ఒక ఆడపిల్లకు జన్మనిచ్చింది. తొలుత బెర్లిన్ కాబరేలలో గాయనిగా వున్న మార్లేన్ డీట్రిచ్ 1929లో వియన్నీస్ చలన చిత్ర దర్శకుడు స్టెర్న్‌బెర్గ్ కంట పడడంతో, అయన అమెను సినీ నటిగా మార్చారు.... జర్మనీ మీద విషాద మేఘాలు అలముకుంటున్న కాలం 'నాజీ'లను తీవ్రంగా వ్యతిరేకించిన డీట్రిచ్ అమెరికాలో ప్రవాస జీవితం గడపడానికి నిశ్చయించుకుంది. జర్మన్ పౌరసత్వాన్ని

త్యజించి అమెరికన్‌గా మారిపోయింది .... మానవ హక్కులు, స్వేచ్ఛ పట్ల ఆమెకు గల అంకిత భావాన్ని జర్మన్ ఛాన్సలర్ హెల్ముట్ కోల్ ప్రశంసించారు. యుద్ధానంతర కాలంలో మార్లేన్ డీట్రిచ్ "గోల్డెన్ ఇయర్ రింగ్స్", "ఎ ఫారిన్ అఫయిర్" "రాంకో నోటోరియస్" "విట్‌నెస్ ఫర్ ది ప్రాసిక్యూషన్", "టచ్ ఆఫ్ ఈవిల్" "జడ్జిమెంట్ ఎట్ న్యూరెంబెర్గ్" మొదలైన చిత్రాలలో నటించింది.

(అమెరికా సమాచార శాఖ

## జీవ నదులు

ఒకప్పుడు మానవ సమూహాలు సంచార జీవనం సాగిస్తూ ఉంటూ పశువుల మందలతో సహా ఎక్కడ పుష్కలంగా నీరు, పశుగ్రాసం లభిస్తాయో అక్కడే ఆగుతూ జీవన యాత్ర చేశారు.... క్రమంగా నదీ తీరాల్లో స్థిర నివాసం ఏర్పరుచుకోవడం జరిగింది. సమాజాలు అట్లా ఏర్పడ్డాయి. పరిణామ దశలో సంస్కృతి అంకురించింది. ప్రాచీన ప్రపంచంలో గొప్ప సంస్కృతులుగా విలసిల్లిన మొహంజోదర్, హరప్పా, వైదిక సంస్కృతి, ఈజిప్టు, పర్షియా మొదలైనవన్నీ, నదీలోయాల్లో వేరూని మహా వృక్షాలైనాయి. ఒక్క మాటలో, సకల మానవజాతి సంస్కృతికీ ఆధార భూతమైనది నీరు. అందువల్లనే ఈ మాతృ సంబంధాన్ని గుర్తించుకొని ప్రాచీన భారతీయులు నదీనదాలకు దైవత్వాన్ని ఆపాదించడమేకాక వాటిని తల్లిగా భావించారు. ఆ జీవక్షీర ధారలు మానవజాతినీ, నాగరికతనూ పరిపుష్టం చేస్తూ మనిషి మనుగడకు ఆధారం కల్పిస్తున్నాయి. నదులు జీవసూత్రాలు. అవి మనుషుల్ని కలుపుతాయి తప్ప విడదీయవు. నాగరికత పరిణామ దశలో నదుల పాత్ర క్రమంగా మారుతూ వచ్చింది. స్వచ్ఛంగా, చల్లగా, అమృతంలా ఉండే నదీ జలాలు ఒకప్పుడు కేవలం దాహం తీర్చుకోడానికీ స్నానం చెయ్యడానికీ ఉపయోగించేవారు. స్థిర వాసాలు ఏర్పడ్డ తరువాత, వ్యవసాయం నేర్చిన తరువాత నదీజలాలు పంటలు పండించడానికి ఉపయోగించారు. వేదకాలంలోనే చిన్న కాలువలకు అడ్డుకట్ట కట్టే పద్ధతి ఉండేది. వ్యవసాయం క్రమంగా మధ్య యుగాల వరకూ విపరీతంగా వ్యాపించింది. అంటే ఉత్తర దక్షిణ భారతదేశంలో అడవులను నరికి వ్యవసాయ క్షేత్రాలను చేసుకోవడం, మొదట గుర్రాలతో దుక్కి దున్నించిన తరువాత ఎద్దులను ఉపయోగించడం, ఊటబావులు తవ్వుకోవడం, వివిధరకాలైన పంటలు పండించడం, ముఖ్యంగా నదుల నుంచి కాలువల ద్వారా వ్యవసాయానికి నీళ్లు వాడుకోవడం అన్నమాట. పండుగలు. పర్వ దినాలు పుణ్యస్నానాలు, రవాణా, ప్రయాణాలు అన్నీనదులతో ముడి పడ్డవే. చారిత్రక యుగాల్లో నదీనదాలు రాజ్యాలకు ఎల్లలుగా ఉండేవి. నదీలోయల్ని

హస్తగతం చేసుకోవడానికి ఎన్నో యుద్ధాలు జరిగాయి. బెజవాడ, రాజమహేంద్రవరం, అటువైపు హంపి విజయనగరం కృష్ణా గోదావరుల పుణ్యమే. కృష్ణా డెల్టా, గోదావరి డెల్టా ఆంధ్రుల అక్షయ పాత్రలు కావడానికి ఆ రెండునదులే కారణం. వ్యవసాయ సంస్కృతి ప్రధానంగా ఉన్నంత కాలం నదికీ మనిషికీ ఆత్మీయ సంబంధం ఉండేది. వ్యవసాయాభివృద్ధితో పాటు ఆధునిక కాలంలో నదులు పారిశ్రామికీకరణానికి ప్రేరణ కలిగించాయి. అప్పటి నుంచీ నదుల జీవ లక్షణం. నదికీ మనిషికీ ఉండే బంధుత్వం తీవ్రంగా మారుతూ ఒక క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించింది. బ్రహ్మాండమైన ఆనకట్టలు నిర్మించి నదీ గమనాన్ని నిరోధించి, నదీ జలాలను మళ్లించి కొన్ని లక్షల ఎకరాలను సాగులోకి తీసుకొస్తున్నారు. మౌలికంగా వ్యవసాయానికి నీటివాడకం అనే సూత్రం ఒకటే అయినా ఈ భారీ ఆనకట్టల వల్ల నది జీవ వైవిధ్యాన్ని పోగొట్టుకొంది. ఇసుక మేటలు వెయ్యడం, నదీ గమనం మారడం, నీటి క్షమత తగ్గి పోవడం, నదిమీద జీవించే జాతుల జీవనాధారం దెబ్బతినడం, క్రమంగా పొలాలు క్షారమయం కావడం, కొన్ని ప్రాంతాలలో వ్యాధులు ప్రబలడం - ఇవన్నీ కూడా పరోక్షంగా నీటి వాడకం మారడం వల్ల ఏర్పడిన దుష్పరిణామాలే.

(సర్వోదయ ప్రెస్ సర్వీస్

## మిసిసిపి మసాలా

న్యూయార్కులో విడుదలైన - 'మిసిసిపి మసాలా' చిత్రం విమర్శకుల ప్రశంస లందుకుంది. మిసిసిపీకి చెందిన ఒక నల్లజాతి 'కార్పెట్ క్లీనర్'కి, ఆఫ్రికాలో జన్మించిన భారతీయ సంతతి యువతికి మధ్య నడిచే ప్రేమ ఈ చిత్రంలో ముఖ్య ఇతివృత్తం. భారతీయ దర్శకురాలు మీరా నాయర్ రూపొందించిన ఈ రెండవ చిత్రం (తొలిచిత్రం సలాం బోంబే)లో.... ఇడీ అమీన్ నిరంకుశ పాలనాకాలంలో ఉగాండ నుంచి బహిష్కృతులైన ఒక భారతీయ కుటుంబం మిసిసిపీలోని ఒక చిన్న పట్టణంలో స్థిరపడి, అక్కడ ఒక 'మోటెల్' నడుపుతుంటారు. వారి కుమార్తె మీనా 'డెమిట్రియస్' అనే నల్లజాతి వ్యక్తి ప్రేమలో పడడంతో భారతీయ సంతతి వారిలోను, నల్లజాతి వారిలోను 'తుపాను' చెలరేగుతుంది. అమెరికాకు వలస వెళ్లి అక్కడ స్థిరపడిన వారు ఎదుర్కొంటున్న సంక్లిష్ట సమస్యలను, ఒక భారతీయ కుటుంబంలో తరాల మధ్య సంఘర్షణను ప్రతిబింబించిన ఈ చిత్రాన్ని సమీక్షిస్తూ 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక దీనిని ఒక సుమధుర చిత్రంగా అభివర్ణించింది.... "...ఈ చిత్రం ఈ జాత్యంతర ప్రేమ కథా చిత్రంలో ఆస్కార్ అవార్డు గ్రహీత డెంజిల్ వాషింగ్టన్ (1989లో - 'గ్లోరీ' చిత్రం), నూతన నటి సరితా చౌదరి ముఖ్య పాత్రలు పోషించారు. ఇతర ప్రధాన పాత్రలలో ప్రముఖ తారలు షర్మిలా టాగోర్, రోషన్ సేథ్ నటించగా చిత్రం షూటింగ్ ఆఫ్రికా, అమెరికా, ఇండియాలలో జరిగింది.... మీరా నాయర్ తొలి చిత్రం "సలాం బోంబే" బొంబాయి నగరంలోని వీధులలో బతికే బాల బాలికల జీవితాన్ని ప్రతిబింబించింది. అది వాణిజ్య పరంగా విజయం సాధించడంతో పాటు విమర్శకుల ప్రశంసలు కూడా పొందింది. 'కేన్స్', మరికొన్ని ఇతర చలన చిత్రోత్సవాలలోను అవార్డులు పొందింది. 10 లక్షల డాలర్ల కంటె తక్కువ బడ్జెట్‌తో నిర్మించిన 'సలాం బోంబే' చిత్రం అమెరికా, యూరప్‌లలో 40 లక్షల డాలర్ల వసూలు చేసింది. ఒక కొత్త డైరక్టర్ రూపొందించిన 'ఆర్ట్' చిత్రం ఇంతటి వసూళ్లు సాధించడం విశేషమని భావించవచ్చు. 'సినీకామ్' ఈ చిత్రాన్ని అమెరికాలో పంపిణీ చేసి, ఉత్తర అమెరికాలో అత్యధిక మొత్తంలో వసూళ్లు సాధించిన భారతీయ భాషా చిత్రంగా విశిష్ట స్థానం పొందడానికి తోడ్పడింది. 75 లక్షల డాలర్ల వ్యయంతో రూపొందించిన 'మిసిసిపీ మసాలా' చిత్రం నిర్మాణం, షైనాప్పింగ్, పంపిణీలలో కూడా 'సినీకామ్' ప్రమేయం వుంది.

(అమెరికా సమాచార శాఖ

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్న చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో ప్రకాశరాయడు గారొకరు.... వారి జీవిత గాధలోని సంక్షిప్త భాగాలివి.

ప్రశ్న 5. భారత స్వాతంత్ర్యోద్యమాన్ని అడ్డుకోడానికి బయలు దేరిన అవరోధాలు ఏవి? కొన్ని ముఖ్యసంఘటనలను పేర్కొనండి.

జవాబు : గాంధి జీవించి యున్నప్పుడే అతని అహింసోద్యమానికి వ్యతిరేకంగా కాంగ్రెసు లోపలనే ఉద్యమాలు బయలు దేరాయి. ఉదాహరణకు (1) గాంధి వలదన్న శాసనసభా ప్రవేశం (2) ఆయన కిష్టంలేని హింస అహింసల కలగలుపు (3) గాంధినుండి విడి పోయిన వారు (changers) విడని వారు (no-changers) మున్నగునవి. వీటిని చూచి గాంధికి కలిగిన విసుగు, విలాపం అందరెరిగినదే. ఇటా కొందరు నాయకులు పెడదారిని పడ్డప్పుడు అతడు అపారమగు ఓర్మి వహించాడు ; ఒక్కొకప్పుడు వారికి నెమ్మదిగా సలహా లీయడం; వేరొకప్పుడు అవసరాన్ని బట్టి వారిని తీవ్రంగా మందిలించడం ; చేయిదాటి పోయి, పరిస్థితులు విషమించినప్పుడు ఏమీ చేయలేక కంటతడి పెట్టడం కూడా జరిగేది. వారెవరు ? కాంగ్రేసు కార్య నిర్వాహక సంఘము వారే ! ఇంకొక సంఘటన యేమంటే, అతని స్వరాజ్య ప్రణాళికను ఎగుర గొట్టడానికి జిన్నా సాహేబు నాయకత్వాన ముస్లింలీగు చేసిన ప్రయత్నం.

ప్రశ్న 6. స్వరాజ్య ఆందోళన చరిత్రలో మీరు వహించిన పాత్ర యెట్టిది ? ఆ పాత్రలో మీ వల్ల జరిగిన ఏవేని ప్రత్యేక సంఘటనలను కొన్నిటిని తెలుపండి. దేశ స్వాతంత్ర్య సంపాదనలో అవలం

బింపబడిన అహింసా పద్ధతి యందు మీకు పూర్ణమగు నమ్మకముండెనా ?

జవాబు : సామూహిక అహింసా పద్ధతి పట్ల నాకున్న నమ్మకాన్ని గూర్చి నాకే మాత్రపు సంశయం లేదని నా మనసులోని మాట నేను చెప్పగలను. అహింసను విశ్వాసంతో చక్కగా వినియోగించుకో గల కళ బాగుగ తెలిసియుంటే అంతకు మించిన సాధనం వేరొకటి మానవుని చేతిలో లేదని నా దృఢమైన నమ్మకం. దారుణమగు హింసా కృత్యాలతో ప్రపంచం ఈ వరకే విసిగిపోయియుంది. Non - violence is the activist force in the world, if one can wield it well' అని మహాత్ముడు తరుచుగా అంటూ వుండిన మాటను నా జీవితాన్ని సరిదిద్దు కొనేటందుకు ఎప్పుడూ నేను జ్ఞప్తికి తెచ్చు కుంటాను.

ప్రశ్న 7. జైళ్లలో మీ అను భవాలను కొంచెం వివరించండి.

జవాబు : బళ్లారి కంటోన్మెంటు జైలు సూపరెంటు Mr. Greenwood తో నాకు తటస్థమైన ఒకే ఒక మరువ రాని మహాద్భుత అనుభవాన్ని గూర్చి వేరొక సందర్భంలో చెప్పకునే యున్నాను. అది అతని నెట్లా మనిషిగా మార్చిందో నాకును అంత indirect గా ఉపయోగ పడ్డది. ఈ ఒక్క సంఘటన ముందు మరి నాయే యితర అనుభవాలూ పనికి రావు.

ప్రశ్న 8. ఆ నాటి రాజకీయ ముఠాల మధ్య ఏమైనా భిన్నాభి లుండెనా ?

జవాబు : అన్నిచోట్లలో వలెనే ఆంధ్రలో కూడ రాజకీయ నాయకుల మధ్య (రాజకీయ విషయాల్లో మరీను సుమండి - నిర్మాణకార్యక్రమంలో ఎట్టి విభేదాలకును అవకాశమే లేదు) భిన్నాభిప్రాయాలుంటూనే వుంటాయి. వుండక మానవు. అరమరిక లున్న చోట అవి వారివారి వ్యక్తిగత స్వభావాలకు సంబంధించినవే కాని స్థిరమైన ఉద్యమ సిద్ధాంతాలకు సంబంధించినవి కావు. అది నాకు తెలిసిన విషయం. ఏలనంటే దేశాని కానాటి ఉద్యమానికి ఏకైక నాయ కుడు మహాత్ముడు. కార్యకర్త లందరి కిని వారి వారి విధులను పూస గుచ్చి నట్లు తేటపరచి యుండెనతడు. కార్యకర్తలకే గాదు, నాయకులకును, దేశ ప్రజలందరికీ గూడా. గాంధీ స్పష్టీ కరించి పెట్టిన మార్గాన్ని అందరు అనుసరించి యుంటే.... (అదే జరుగలేదు)

ప్రశ్న 12. గాంధీతోను, తదితర జాతీయనాయకులతో మీకు వ్యక్తి పరంగా పరిచయముండెనా ?

జవాబు : మహాత్మునితో నాకు ఎట్టి ప్రత్యేక పరిచయమూ లేదు. మా హరిజన ఆశ్రమంలో ఒక రాత్రి ఆయన మకాం చేసినపుడు గూడ నన్ను నేను ఆయనకు తెలుపుకొని పరిచయం చేసుకొనవలెననే ఆత్రత గూడ నాలో లేకుండెను. ఆయనతో చాలమంది

వచ్చి ఆ రాత్రి అక్కడనే యుండిరి. ఆయనతో నుండిన ఆంధ్ర నాయకు లందరు నన్నెరిగినవారే. అనాడు ఆయన వెంటనుండిన నాయకులు రాజకీయ వ్యామోహం లేనివారు. "గ్రామ స్వరాజ్య స్థాపన పట్ల అత్యంత అపేక్షతో నుండినవారు.

ప్రశ్న 13. భారత కాంగ్రెసు యొక్క నిర్మాణ కార్యక్రమ ప్రభావం అప్పటి సంఘ వ్యవస్థపై ఎంతవర కుండెను ?

జవాబు : నిజానికి ఆ కార్యక్రమమే గాంధీని మన ప్రజానీకానికి ప్రేమా స్పదుణ్ణి, గౌరవనీయుణ్ణి చేసింది. రాజకీయ రంగంలోని పెద్ద నాయకులూ ఎన్నికల కోసం ఏడాది పొడుగునా వారి వెంట తిరిగే అను చరులు గాంధీ నిర్మాణ ప్రణాళిక పట్ల సవతితల్లి ప్రేమనే చూపుచుండిరి. 'ముందుగా దేశానికి రాజకీయ స్వేచ్ఛ రావాలి, నిర్మాణ ప్రణాళిక విషయం తరువాత చూద్దాం' అనే పాక్షికదృష్టి వారిది. రాజ్యాంగ బలమే, పదవులే సర్వస్వంగా చూచుకునే రాజకీయ జీవులను ఏమనగలడు ఒక్క గాంధీ ? 'నాది చివరకు అరణ్యరోదనమయి పోయింద'ని చివరికాలంలో అతడు నిస్పృహ పొందాడు. గాంధి కాలంలో ప్రాణతుల్యంగా తలపబడ్డ మద్య నిషేధాన్ని గాలికి తుడిచి పెట్టుకు

పోయింది. దేశ సౌభాగ్యానికి ప్రధాన రక్షా మంత్రంగా అమలుపరచిన బేసిక్ విద్యను నిలువునా ప్రాణంతీసి ఎత్తివేశారు. జాతికి వెన్నముకగా కళ కళలాడుతూ వృద్ధికి వచ్చిన వడుకు నూలు ఖద్దరు వస్త్రం యిప్పుడు కొనయూపిరి తీసుకుంటోంది. తన నిర్మాణ ప్రణాళిక ఒక్కటి నాలుగు పాదాలా నడిస్తే శాసనోల్లంఘనం తోను, జైళ్ల ప్రవేశంతోను పనే వుండదని అతడు పదేపదే చెపుతూనే యుండెను. మరి ఈనాడు మిల్లు చదువులు, మిల్లు బట్ట, మిల్లు బుద్ధి.

ప్రశ్న 15. మొదటికాలపు గాంధీ యుద్యమాలకు, 1942 ఉద్యమానికి భేదమెకడుంది ?

జవాబు : దక్షిణాఫ్రికాలోని గాంధీ సత్యాగ్రహంలో అక్కడి వేలకొలది ఇండియా కూలిజనులు, అక్కడి యిండియా వర్తకులతో సహా గాంధీ వెనుక బలంగా నిలబడి ఆయన ఆజ్ఞకు బద్ధులై చెప్పరాని కష్టాలను భవించారు. ఉద్యమాన్ని నడిపిన అక్కడి మహాత్ముని అనుచరులు కూడ అతని కెదురు చెప్పక అతడు గీచిన గీతపై నిలబడ్డారు. అట్లా దక్షిణాప్రికా సత్యాగ్రహం ప్రపంచానికే ఆదర్శమయింది. కనకనే గాంధిని రాచి రపాన బెట్టిన అక్కడి గవర్నర్ జనరల్ స్మట్సు సేనాని రిటైరయి గాంధికి శిష్యుడైనాడు. ఆశ్చర్యం! ఇండియా సత్యాగ్రహం అంత నైతిక బలంతో సాఫీగా నడవలేదు. అడ్డదార్లు తొక్కి అనేక విధాల గాంధిని రొష్టు పెట్టినవారు కాంగ్రెసులోనే వుండిరి : అయినా దైవ నియతి వల్ల అతని సత్యాహింసలే బ్రిటిష్ అధికారాన్ని పై దొలగ చేశాయి. 1942 ఉద్యమం కేవలం కాంగ్రెసుదే అసలేము. దేశస్థుల మధ్య భేదం లేని, పార్టీల మధ్య భేదం లేని, భారతీయులందరు కలిసి పాలాని ప్రభుత్వాన్ని లేచిపొమ్మన్న "Quit India" ఉద్యమం 1942 వి. దానికి తుదిపోరాటం (fight to the finish) అని పేరుపెట్టాడు మహాత్ముడు.

ప్రశ్న 16. ఇండియాకు స్వాతంత్ర్యాన్ని త్వరగా తీసుకొనివచ్చిన పరిస్థితులు ఏవి ?

జవాబు : శ్రీ అట్లీ ప్రధాన మంత్రిగా నుండిన లేబరు పార్టీ ప్రభుత్వమే సత్వర స్వాతంత్ర్య ప్రకటనకు ఒక ముఖ్య కారణం. ఏ చర్చిల్ గాని బ్రిటిష్ ప్రధాన మంత్రియై యుండినచో ఇండియా యిడుములు యింత త్వరగా తీరి యుండవు. బ్రిటిషు సామ్రాజ్యం యొక్క బలం, పరపతి క్షీణించి నీరసపడుట యొక్కటే ఇండియా స్వాతంత్ర్య ప్రకటనకు ప్రధాన కారణమని కొందరంటుంటారు. కాని నా నమ్మకమది కాదు. ఆధునిక కాలంలో కని విని యెరుగని, మహాత్మా గాంధీ యొక్క తపశ్శక్తియే అహింసా కర్మ యోగ బలమే

(సంభవామి యుగేయుగే అన్నట్లు) ఈ మహా సంఘటనకు ముఖ్య కారణమని నా విశ్వాసం.

ముమ్మూర్తులలో మొదటివారు (1) డాక్టరు చల్లా సుబ్రహ్మణ్యంగారు, 1930 - 34లో బళ్లారి కంటోన్మెంట్ జైలు డాకరు. Mr. Greenwood అప్పుడు జైలు సూపరెంటు. ఆ సమయంలో ఖైదీలలో, నాతో సహా కొంత మందికి 'జాన్డిస్' (పచ్చకామెర్లు) వచ్చి జైలు ఆసుపత్రిలో ఉంచబడ్డాము. అప్పుడు ఈ సుబ్రహ్మణ్యం మహనీయుడు మాకు చేసినసేవ అనన్యం. ఆసుపత్రిలో నుండియే ఒక ఉత్తరం ద్వారా నేనాయనకు నా కృతజ్ఞతను తెలుపుకొనకుండా ఉండలేకపోతిని. నా వుత్తరానికి ఆయన బదులు వ్రాసి పంపిన typed లేఖలోని కొన్ని మాటలు యిట్లున్నవి : "Bellary Cantonment - 8th March 1931. My dear Prakasarayadu Garu ; Your kind letter I have and I shall ever preserve it as an acquisition, however undeservedly procured. This piognant output of your sweet conscience, believe me, will be





"Did Ravana face Hanuman on the battle front? Did they actually fight any time?"

"Ravana's first encounter was only with Hanuman. 'You have been granted a boon saving you from Suras, Asuras, Yakshas, Gandharwas etc., but you had forgotten to include Vanaras in the list. So, I shall have the chance to finish you off,' said Hanuman on his face. And Ravana immediately responded, 'Try your luck.' "

"Did they fight?" - Raghu wanted to know.

"Yes. It was a game of strength and wits between the two. Ravana gave a fist-blow to Hanuman on the chest. Staggering a little, Hanuman recovered from the shock and returned the blow which made Ravana reel like a mountain during earthquake. Composing himself, he complimented Hanuman for his might and valour. 'Give me another blow which forces me to reply and that would surely send you to the other world' challenged Hanuman. In the meantime Ravana got engaged with Neelu and Hanuman commented, 'When you are fighting someone else, my code of conduct does not permit me to interfere and as such you are spared for the time being," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha* **(*Director : BVSS Mani*)**
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



my guide for the times to come. Such are the loving sentiments you have so kindly expressed towards my humble unworthy - self, and I shall ever strive to deserve them... Nothing pays like TRUTH, for that is the essence of God Dear Sir, kindly forgive if I should acclaim my proud satisfaction, that even my farce of a service to the IMMORTAL SATHYAGRAHIS, has been reckoned as so much by a gentleman of your standing, True indeed, the good always think of good, as they are incapable of doing otherwise. May God bless you and the like of you is the constant prayer of your humble friend, C. Subrahmanyam.

ఇక రెండవ మహనీయుడు, శ్రీ భారతానంద, మదనపల్లి. మధ్య వయసు దాటిన పోలిష్ ఇంజనీరు, Maurice Friedman. ప్రపంచంలో ఒక్కొక్కని జీవితం ఎట్లా అద్భుత పరివర్తనం చెందుతుందో చెప్పలేము. ఈయన గాంధిచే ఆకర్షింబబడి పోలెండును పూర్తిగా వదిలివేసి, మదనపల్లిలో ఒంటరిగా నివాస మేర్పర్చు కున్నాడు. నేను భారత ఖాదీబోర్డు పని చేస్తూ (1957) రెండు మూడు సార్లు ఆయన వద్దకు మదనపల్లి వెళ్లాను. శ్రీ భారతానంద ఇండియాలో పెట్టుకున్న ఒకే ఒక పని ఖాదీసేవ. తన యింజనీరింగు ప్రావీణ్యమంతా రకరకాల రాట్నాలు కనిపెట్టడంలో వినియోగించాడు. 'ధనుషత్ తక్లీ' కుటుంబ చరఖా మున్నగునవి. తాను invent చేసిన నాలుగణాల ధనుష్ తక్లీని మాడమ్ ఛియాంగ్ - కె - షేక్‌కి బహూకరించాడు - ఆ దంపతులు ఇండియా వచ్చినప్పుడు. ఇక నా పట్ల భారతానందుని కేర్పడ్డ ప్రేమాతిశయం (అంతా దైవకృప) అపారం. భోజనం, ఫలహారం, నిద్ర - అన్నిటను - రోజంతా నాకు సమస్తోపచారాలు స్వయంగా చేసేవాడు. నేను బస్సెక్కి పోయేటప్పుడు బస్సు కదిలేవరకూ తాను క్రింద నిలబడి నాతో మాట్లాడుతూనే వుండేవాడు. శ్రీ రమణమహర్షి, జిడ్డు కృష్ణమూర్తిగార్ల బోధలు భారతానందునికి పరమ ప్రమాణాలు. అంత లోతైన మనిషి, అంత సాదామనిషి భారతానంద! ఒక తెల్లని పొట్టిచొక్కా, లాగు, ఎల్లపుడు ఆయన దుస్తులు. తెల్లని శరీరం, కొంత నెరసిన బోడిజుట్టు. 'ఖాదీమనిషి' అని ఆయనకు నేను పెట్టిన పేరు. నా ఖాదీబోర్డు పని అయిన వెంటనే నాకొక జాబు వ్రాస్తూ "Would you like to come down to Madanapalle and work here? A way will be found to keep you above want. Keep well. Yours cordially, Bharatnanda." ఇంతగా నన్ను తమ వాణ్ణి చేసుకున్న

వారెందరున్నారు ? బహు కొద్ది మంది. మూడవవారు శ్రీ కిలారు లక్ష్మీనారాయణగారు, ఇంగ్లీషు అక్షరం ముక్క రానివాడు, భూస్వామి. ఆస్తి యీయవలసినంతగా భార్య కిచ్చేశాడు. రెండు యకరాలు మాత్రం విడదీసి, అందులో ఒక యకరం గాంధీ గ్రామ సేవా కేంద్రానికి దఖలు పరిచాడు. రెండో యకరంలో తన 'సేవా శ్రమం' నిర్మించుకున్నాడు. అక్కడే భోజనం, రాత్రింబగళ్లు ఉనికి. ఉన్నంతలో ఆయన దానధర్మాలకు పెట్టింది పేరు. ఆయన కున్నవి రెండే రెండు పనులు : చిన్నగొడ్డలి, పార, తొళ్లికతో ఆశ్రమ భూమిలో నిత్య పరిశ్రమ. అపరాహ్ణమంతా పూర్వ, ప్రస్తుత ధర్మగ్రంథాల పఠనం పరిశీలన, వృద్ధాప్యంలో యిట్టి గ్రామీణ శ్రద్ధాళువులను మరొకరిని నేను చూడలేదు ఆయనది కృష్ణాజిల్లా పెనమలూరు. ఆయన వద్దకు వెళ్లి నప్పుడల్లా నన్ను ఊళ్లో త్రిప్పి అందరి తోను పునః పరిచయం చేసేవాడు. నా వద్దనే కూర్చుని, మరల తన ఆశ్రమానికి తీసుకొని వెళ్లేవాడు. ఈ ముదుసలి మిత్రుడు లక్ష్మీ నారాయణ గారు నకిలీలేని ఖరారు మనిషి.

☘ ☘ ☘

## ప్రస్తావన

"పూర్వ జ్ఞాపకాలు ; నా రాట్న చక్రం" అను రెండు భాగాల జీవితకథ యిది. ఇది వ్రాసియుంచమని చెప్పి నా కుమార్తె శ్రీమతి చిరంజీవి గాడేపల్లి శేషాలక్ష్మి ఎమ్మెస్సి కొన్ని యేండ్ల క్రితం నాకు సలహాయిచ్చి, 'ఏమి, వ్రాయడం పూర్తయిందా' యని అప్పుడప్పుడు ఉత్తరాలు వ్రాస్తూ నన్నడుగుతూ వుండేది. తన భర్త డాక్టరు జి యస్ రావుతో ఆమె ఢిల్లీలో వుంటుంది. ఆయనకు ఢిల్లీలోని 'ఐఐటి'లో రసాయనిక శాస్త్ర ప్రొఫెసరు పని.

కాని యీ కథను వ్రాతలో పెట్ట డానికి నాకు చాలా కాలం పట్టింది. ఎందుకంటే వ్రాయడం యిష్టలేక కాదు — శ్రద్ధ లేకను, విషయాలు వరుసగా జ్ఞాపకం రాకను. అప్పు డప్పుడు కొంచె కొంచెం వ్రాసుకొని ఎట్లాగైతేనేమి పూర్తి చేశాను.

ఈలోగా నాయందు ప్రత్యేక స్నేహవాత్సల్య భావాలుగల అవనిగడ్డ గాంధీ క్షేత్ర నిర్మాతలు, నిర్వాహకులు, మాజీ రాష్ట్ర ప్రజాహిత మంత్రివర్యులగు శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు, వారి కుమారుడు చిరంజీవి బుద్ధప్రసాద్, నేనిది వ్రాస్తున్న సంగతి విని కాబోలు, బుద్ధ ప్రసాద్ బాబు నా పట్ల గల భక్తి ప్రేమాభిమానాల చొప్పున దీనిని పుస్తక రూపంలో ప్రచురించాలనే ఆసక్తి పెట్టుకొని దీని నింతవరకు తెచ్చాడు. ఈ యాలోచన నాకు తెలుపడానికిగాను స్వయంగా అతడు నావద్దకు రావడమే గాకుండ, నే నిందు కంగీకరించేట్టు చెప్పమని,

ఇక్కడి స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియాలో ఉద్యోగిగా నున్న నా కుమారుడు రాజారాంకి ఉత్తరం కూడా వ్రాశాను .... ఇంతాజేసి ఈ వ్రాతలోనున్న సరుకేమిటి ? నా తల్లితండ్రులు, అందరికిలాగునే నేను చదువుకున్న స్కూళ్లు, వూళ్లు, సహాధ్యాయులు, స్కూలుమాష్టర్లు మున్నగు తప్పిస్తే కదా ! కాని నన్ను అవనిగడ్డ గాంధీ క్షేత్రపు తంత్రి కుమారులిద్దరూ సన్నిహితంగా ఎరిగి యుండటం చేతను, నాకు ప్రియమైన వస్తువు చర్ఖా (రాట్నం) కావడం చేతను పుస్తకంయొక్క title చర్ఖాకు సంబంధించి యుంటే వుంటుందని మిత్రుడు ప్రసాద్‌బాబు నాకు సలహా యిచ్చాడు. అతడు అడిగితే అయినా ఏ వాక్యం పలుకుడని నిర్ణయాను భవంగా నేను చెప్పగలను. గాంధీక్షేత్ర పవిత్ర శాఖల నిర్వాహకత్వం తంత్రిగారితో పాటు సగానికి సగం అతని అజమా యిషిలోనే వుంటుందని నా అంచనా - ఆ ప్రెస్సులోని ప్రచురణల పనితో సహా, అతను బి. ఏ., డిగ్రీ తరువాత, దినదినం వెళ్లి బందరులో బి. యల్ డిగ్రీకి తయారవుతున్నాడు. 1921 ఆదిగా గాంధీ యుద్యమంలో నాకున్న సామాన్య కార్యకర్తృత్వం తప్ప మరే

పనీ లేనందు వల్లను, తరుచుకాక పోయినా, అప్పుడప్పుడు అవనిగడ్డ వెళ్ళి గాంధిక్షేత్రాన్ని దర్శించే నా అలవాటుచొప్పునను, ఆ క్షేత్ర పాలకులతో నాకు మంచిపరిచయ మేర్పడింది. ఇటీవల శారీరక శక్తులు డిగి నేను వెళ్లడం లేదు. వారిక్కడికి వస్తే చూచి ఆనందించడమే పరి పాటయింది. నిజమైన గాంధీ మనుష లను చూస్తూండడం, వారిని గూర్చి వినడం - ఇంతే నా కిటీవలి స్వయం కల్పిత యుద్యోగం! ఇట్లాగే ఈ తండ్రి కొడుకు లిరువురూ నా కాత్మ బంధువులైనారు.

అప్పటి బ్రిటిషు సర్కారు నన్ను మూడేండ్ల పాటు కఠిన కారాగారంలో పెట్టి పరోక్షంగా నాకిచ్చిన యోగ్యత, నిజానికి ప్రత్యక్షంగా నాకీ రాట్నం వల్లనే దక్కింది. ఏలనంటే రమారమి మొదటి వయస్సు 20 యేండ్లు పోగా, కడిచిన ఏడు దశాబ్దాలకాలం నేను ప్రధానంగా రాట్నచక్ర ప్రణాళికా పక్షపాతిని. ఇందు కించిత్తత్యుక్తి లేదు. గాంధీ స్వాతంత్ర్య పథకంలో గూడ ప్రధానం గాను అత్యవసరం గాను నన్ను ఆకర్షించిన విషయాలు (1) హిందూ ముస్లిం, క్రైస్తవాది మతాల సామరస్యం, సఖ్యత హెచ్చు తగ్గుల పరమైన కుల కక్షల (భేదాల) నిర్మూలనం కూడా ఇందులోనిదే. (2) ఖాదీ అందులోనిదే గ్రామ కుటీర పరిశ్రమలు. (3) అస్పృశ్యతా నిర్మూలనం. (4) మద్య నిషేధం — ఇందులో పొగాకు, గంజాయి మున్నగు మత్తుపదార్థాల నిషేధం కూడా కలిసి యుంది. (5) జాతీయ విద్య అంటే ఆంగ్ల ప్రభుత్వ విద్యా పద్ధతుల నిరసన - ఈ యైదు విషయాల మీదను ప్రత్యేక శ్రద్ధ పెట్టుకొని చేతనైనంత పని నేను చేసినట్లు నాకు జ్ఞాపకం. ఇందుకు సంబంధించిన తబ్సీళ్లు ఈ పుస్తక పుటలలో కన బడతాయి. వీటితో సంబంధం లేని కాంగ్రెస్ యెన్నికలు, రాజకీయాలు మున్నగు కార్య కలాపాలతో నా కెన్నడూ ఎట్టి సంబంధం లేకుండెను. వాటి మీద నా దృష్టి పొరకుండటం నా అదృష్టంగా భావించాను. ఈ యదృష్టానికి తోడు గాంధీ సత్యా గ్రహం కూడా రాట్న చక్రపు పునరుజ్జీవంతోనే ప్రారంభ మయింది.

If you remove my constructive programme from me I am dead అన్నట్లు గాంధీ అనేక సార్లు ప్రపంచానికి ప్రకటించాడు. గాంధి ప్రణాళిక ద్విముఖం (1) సహాయ నిరాకరణం (Non-cooperation) అంటే ప్రతికక్షిపై ఆధార పడని స్వయం సహాయం (2) అవసరాన్ని బట్టి సర్కారు శాసనాలను కచ్చితంగా ధిక్కరించి శత్రుబాధలను ఓర్మితో సహించడం రెండూ కలిసి సత్యాగ్రహ మనబడుతుంది. ఇది ఆత్మశ్లాఘకాకపోతే మరోమాట. ఈ మూడేండ్ల కఠిననిర్బంధ కాలంలోనూ జైలువాళ్ళిచ్చే దరిద్రపు తిండితోను, ఖైదీల నడవడిని గూర్చిన నిబంధనల

నతిక్రమించు కుండాను, పాటున దొంగ తిండ్లు తినకుండాను కాలక్షేపం చేయగలిగానన్న సర్టిఫికెట్ నాకు నేనిచ్చుకోగలను. బయట తిరిగేటప్పుడే గాక, జైళ్ళ నివాసంలో గూడ మనిషి తాను సత్యాగ్రహి యనిపించు కోవాలి. కేవలం రాజకీయదృష్టికీ, ప్రజాసేవకు సంబందించిన దేశ నిర్మాణ దృష్టికీ పొత్తు కుదరదు. నేరుగా ప్రభుత్వ శాసనాలను ఉల్లంఘించే ప్రసక్తి పెట్టు కొనకుండ, భక్తి శ్రద్దలతో, పట్టు దలతో, దేశవ్యాప్తంగా నడిచే ఒక్క నిర్మాణ కార్యం ద్వారానే సులభ సూక్ష్మంగా దేశ స్వాతంత్ర్యం చేకూరు తుందని మహాత్ముడు పొడుగునా చెపుతూనే యుండెను. ఒకటే మాటగా గాంధి యేమన్నాడు? "By very nature and in practice, I am a constructive worker. Out of sheer necessity, I had to enter politics" మరొక రెండో మాట: 'I enter politics only so for as they agree with my religion" - రెండూ కలుపుకుంటే గాంధీమతం క్లుప్తంగా మనకు తెలుస్తుంది. మొదలూ చివరా ఏక బిగిని దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం పేరిట గాంధీ జరిపిన ప్రజాసేవయే అప్పటికక్కడ పూర్ణవిజయం పొందింది, ఇండియా ఉద్యమం కూడా గాంధీ (ఒక్కవ్యక్తి) ఆత్మ శక్తి ప్రబావం వల్ల ఆరంభంలో ఒక్క పెద్దమలుపు తిరిగింది. ఐతేనేం గాంది జీవించి యుండగానే సారం కోల్పోయింది.

గాంధి నావంటి కొంతమందికి చేత బెట్టిన చర్ఖాను 'నా రాట్న చక్రం' గా దర్జాగా ఉపయోగించుకున్నాను. బుద్ధుని తరువాత గాంధి ఒక నూతనా వతారంగా ఈ గడ్డపై రెండవ భగ రీథుని వలె పుట్టి ప్రపంచం మఱచి

పోయిన అహింసా సత్యా గ్రహాలను గుర్తుచేశాడు.

ఆనాటి దక్షిణాఫ్రికా గవర్నరు జనరల్ స్మట్సు సేనాని ఒకడు; ఇండియా పశ్చిమోత్తరపరగణా రెడ్ షర్టుల నాయకమణి అబ్దుల్ గఫార్ ఖాన్ ఒకడు. స్మట్సు సేనాని దక్షిణాఫ్రికాలో గాంధీనీ, వేలాది గాంధి అనుచరులనూ తాను పెట్టిన అమానుష హింసల కయి పశ్చాత్తాపం పొందాడు .... దానితో గాంధీ సత్యాగ్రహం ముగింపుకు వచ్చింది. 1942 లో గాంధీని, పరివారంతోసహా, ఆగాఖాన్ భవనంలో ఖైదీగా నుంచారు. ఇండియా గవర్నరు జనరల్ కౌన్సిల్లోని మొదటి (ముఖ్య) సభ్యుడు టాటెన్‌హామ్ గాంధియే దేశం మొత్తానికి పెద్దద్రోహి యన్నట్లు బహిరంగంగా ప్రకటించాడు. 'శ్రీ గాంధిని నేనెరిగిన నంతగా మరెవ్వరూ ఎరుగరు. అంత పెద్దమనిషిని, నిజాయితీపరుణ్ణి ఆ మాటతో అవమానించడం నేను ఎంత మాత్రం సహించ'నని చెప్పి ఇండియా సర్కారును అంతకంటె బిగ్గరగా ఖండించాడు స్మట్సు.

ఇక నేటి అప్రాచ్య, అసభ్య ప్రపంచానికి ఎదురెత్తుగా సంఘటించిన సరిహద్దు గాంధి, మోహన్‌దాసు గాంధీల అపూర్వ యేకత్వంకూడ అటువంటిదే. 'The mind in its own place, can make a heaven of hell and a hell of heaven (also)' అన్నది మిల్టన్ మహాకవి ప్రవచనం. ఇందలి రెండో విషయం ఇక్కడ మనకక్కర లేదు. మోహనదాసు యొక్క అహింసోద్యమ కథను విన్నంత మాత్రాన 'అఫ్రడీ' లనబడే తన అసాధుజాతిలోని లక్షాయేబదివేలమందిని అహింసావ్రతులుగ తయారు చేసిన పరమ సాధు, విప్లవ ధీరమతి అబ్దుల్ గఫార్‌ఖాను. ఖాన్ సాహెబ్ ఆహ్వానంమీద గాంధి, మహదేవ దేశాయ్‌లు వెళ్ళి, సరిహద్దు రాష్ట్ర సత్యాగ్రహ శాంతి సైన్యంతో నెలరోజులు గడిపారు. ఇండియాకు స్వాతంత్ర్యం పశ్చిమోత్తర దిశమీదుగానే రాగలదనే ఆశాభావాన్ని వ్యక్త పరిచాడు మహాత్ముడు.

పైకి చెప్పుకున్నా చెప్పుకొనక పోయినా అంతర్ముఖ పరిపూర్ణుడు చెప్పుకోదలిచిన మాట ఒకటుంది 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్' – ఇక్కడ తెలిసినంత వరకు కొంచెం స్వయం పరిశీలన చేసుకోవాలి. అది నాకు మంచిది. ప్రతి వ్యక్తిపైన తలకు తగిలీ తగలకుండా వాడమైన తోపు ఒక ఖడ్గం వ్రేలాడు తుంటుంది. అది తలకు తగిలి గాయం పడటం, తగలక పోవడం ఆ వ్యక్తి యొక్క కర్మఫలం! అసలు మానవ ఆత్మానాత్మల కలయిక. శరీరాన్ని ఆత్మమయ మొనర్చడమే జీవిత లక్ష్యం, సాఫల్యం కూడ. ఈ చెప్పుకునేదంతా నా విషయమే. పనిపాటు లేని విద్యాశాలల చదువు కొంత మట్టుకు అవిచ్ఛిన్నంగా జరిగింది. ఇది నా తండ్రిని మించిన మేనమామ ప్రసాదం. తదుపరి అప్పటికప్పుడు నన్నుపైకి లాగినది గాంధీవిద్య –

(ఇది నా అదృష్టం) బ్రతుకుతెరువు విద్య (Education for life) మితం తప్పి ధనార్జనకు పాల్పడే అవసరం గాంధీ విద్యలో లేదు. అవసరాలు పెంచుకొని, ఋణాల పాలయ్యే దురవస్థ నా దరికి రాలేదు. దుబారా ఖర్చుకు ఎగబడకుండ, ఉన్నంత మట్టుకు బాగా పొదుపుచేసుకొని, బ్రతికిన వాళ్ళలో, నేనొకడను.

—డిసెంబరు 1984

త. ప్రకాశరాయడు

## మా మాట

శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడు గారు తొంబది సంవత్సరాలు నిండి అనుభవం పండించుకొని ఆశయాలు నెఱవేర్చుకొని, యింకా రాట్నచక్రం త్రిప్పుకున్న గాంధీ మార్గాను గామి. కర్మవీరుడు. విద్యా వివేక సంపన్నత్వం తో పాటు ఆశ్రమ జీవనం అధ్యాపక ప్రవృత్తి అభిమానంతో ఆశ్రయించి ఆదర్శం నెలకొల్పి ఆది భౌతిక అధ్యాత్మిక వర్తనం ఆచరించి చూపిన ధన్యజీవి. రఘుపతివెంకటరత్నం నాయుడ గారి శుశ్రూష ఫలితంగా సౌజన్యం సేవాభావం మానవతా దృక్పథం ప్రకాశ రాయుడుగారిలో పరిపూర్ణత నందుకొని జీవితాన్ని ప్రకాశవంతం చేశాయి. ప్రకాశం పంతులుగారి ప్రోత్సాహంతో ప్రభుత్వ రంగంలో కూడ సంపూర్ణశక్తి సామర్థ్యాలు చూపించిన తల్లాప్రగడ వారి జీవిత విశేషాలు ఈ కాలపు యువలోకాని కుత్తేజం ఉత్సాహం కలిగించి జీవిత రంగంలో పురోగమించటానికి ఉపకరిస్తాయనే ఆశయంతో వారి ఆత్మకథ ప్రచురించాలనే సంకల్పం కలిగి, అది వ్రాసి యిమ్మని వారిని మేము కోరాం. మా కోరిక మన్నించి యిచ్చిన 'నా రాట్న చక్రం' పాఠక లోకాని కందిస్తున్నాం.

మండలి బుద్ధ ప్రసాద్
కార్యదర్శి : గాంధేయ సమాజ
సేవాసంస్థ, అవనిగడ్డ.
డిసెంబరు, 1984



ఈ అపూర్వానుభవాలని సంక్షిప్తంగా 'జగతి' పాఠకులకు పరిచయం చేయగల సదవకాశాన్ని కలిగించిన, మండలి బుద్ధ ప్రసాద్ గారికీ, ప్రకాశరాయడుగారి కుమారులు రాజారామ్‌గారికీ మా కృతజ్ఞతాభివందనములు. ఇటువంటి ఉత్తమ రచనలు నేటి పాఠకులకు పరిచయం చేయమని కోరుతూ లేఖాపరంపరతో మమ్ము ప్రోత్సహించిన పాఠక మిత్రులకు ధన్యవాదములు.

# చిత్రజగతి సమీక్షలు

సౌదామినీ క్రియేషన్స్
## 'సుందర కాండ'

బిల్హాణీయం - గురువు గారిని విద్యార్థిని ప్రేమించడం - అతి ప్రాచీనం. రాకుమారికీ, బిల్హణునికీ మధ్య కట్టిన పట్టు తెరలు మధు మేఘ మాలిక లవుతాయి. కాని భాగ్యరాజు ఆధునిక కథా కల్పనలో శత మర్కటాల మధ్య, రోజుకో నెకటై సూటూ మార్చే తెలుగు మాస్టారు, ఆడది జన్మించాక, పుష్పవతి అయాక, యిలా మార్కులు వేస్తూ, పెళ్లికి 70, మాతృత్వానికి నూరూ అని అక్కడితో స్త్రీ జీవితము పరిపూర్ణ మవుతుం దంటాడు. ఒకరోజున స్కూళ్ల ఇనస్పెక్టరు తనిఖీకి వచ్చి, తెలుగు మాస్టారు వెంకటేశ్వర్లు (వెంకటేష్) చెబుతున్న 'సుందర కాండ' గురించి ప్రశ్నవేస్తాడు. అల్లరి పిల్ల, అందాల బరిణె, ఛోటా నాయకురాలు రోజా, సీతాదేవి కష్టాలు 'సుందరకాండ'తో ఎలా తీరినదీ వివరిస్తూ, రాముడూ హనుమంతుడూ యిద్దరూ 'సుందర' శబ్దానికి అర్హులవుతారని చెప్పి, వెంకటేశ్వర్లుని వొడ్డున పడేస్తుంది; ఆ తర్వాత, "I Love you" చీటీ ఇద్దరు అకతాయిలు, రోజా నోట్ బుక్‌లో పెడతాడు; అది తెలుగు మేస్టారి టెబుల్‌మీద కెళ్తుంది; రోజాయే రాసిందనుకొని, వెంకటేశ్వర్లు ఆమెని క్లాసులో నుంచి బయటకి తీసుకు వెళ్లి చీటీ యిచ్చేస్తాడు, రెండు మూడు సార్లు ఈ చీట్ల మార్పుతో అతను తనకిస్తున్నాడని ఆమె, ఆమె తన కిలా రాయడం గురుశిష్య బాంధవ్యానికి కళంకమని అతనూ అనుకుంటారు. ఇద్దరూ ప్రిన్సిపాల్‌కి ఫిర్యాదు చేస్తారు; వెంకటేశ్వర్లు మాటనే నమ్మి రోజాని పదిహేను రోజులు సస్పెండ్ చేస్తాడు ప్రిన్సిపాల్. రోజా తల్లిదండ్రులు శ్రీలంకలో ఉన్నారు; చదువుకోసం ఆమె ఇక్కడ ఉంటోంది. ఈ సస్పెన్షన్ పిరడ్, రోజాలోని ప్రేమలతని మరింతగా పెంచుతుంది. అనాథ బాలునిగా పెరిగి పెద్దవాడైన వెంకటేశ్వర్లు, ధర్మానికి విరుద్ధంగా నడుచుకోని ఆదర్శమూర్తి అవడం వల్ల, రోజా ప్రేమని తిరస్కరించి అనాథాశ్రమంలోని అయిదో క్లాసు అమ్మాయి నాంచారి (నారి)ని పెళ్లి చేసుకుంటాడు. జీవితాన్ని నవ్వు పువ్వులతో నింపాలని నమ్మే రోజా,

నారికి అప్తురాళ్లై, కాన్సరు వెంటాడు తున్నా, ప్రేమసుదకు వోటమి లేదని నిరూపిస్తుంది. రంగురంగుల నృత్యా లతో వినోదాత్మకంగా సాగిన ఈ చిత్రానికి దర్శకులు రామచంద్ర రావు. నిర్మాత : కె వి వి సత్యనారా యణ. . పి ఆర్ ఒ : రాజు.

వందా పిలిమ్స్

## 'సూర్యమానసమ్'

(మళయాళం)

షావుకారు జానకి, మమ్ముట్టి ఒకర్ని మించి ఒకరు తమ నటనా వైదుష్యం కనబరిచిన ఈ చిత్రంలో, ఆమె వయసు పైబడుతున్న మాతృమూర్తి ; అతను చిన్న పిల్లలతో బొంగరాలూ గాలి పటాల స్థాయి అల్లరి చిల్లర అబ్బాయి - ముక్కుకి సూటిగా నడిచే అమాయ కుడు. తల్లి తప్ప మిగతా ఎవరూ ఆ యువకుని అదుపులో పెట్టలేరు. గొర్రెపిల్లలోని నెమ్మది తనం, పులి పిల్లలోని క్రౌర్యమూ రెండూ మిళితమై వుంటాయి. తన మీద చేయి చేసు కొనే దాకా ఎవరినీ ఏమీ అనడు, అలా చెయి చేసుకున్న మీదటకూడా, ఒకటి రెండు సార్లు సహించి ఊరు కుంటాడు. కాని, తన ఓర్పుని అలు సుగా తీసుకున్నారా అవతల వారికి దేహశుద్ధి చేసి గాని వొదలడు. తన తల్లి మీద నిష్కారణంగా దొంగ తనం కట్టిన భామందు వాళ్ల హూనం చేస్తాడు. తల్లికి తనకొడుకు స్వభా వంలోని మంచీ చెడూ బాగా తెలుసు. స్వంత పల్లెలో ఆ భామందు తమ నింక బతకనివ్వడని, అక్కడి పాదరీ సిఫారసుతో, కొడుకుని వెంట బెట్టుకు ఒక టీ ఎస్టేట్‌కి వస్తుంది. వాళ్ల వంచి నిజాయితీతో పని చేసే ఈ అబ్బాయి అక్కడందరికీ వెర్రిబాగుల వానిలా కని పిస్తాడు - కాని, మంచివాడు నమ్మకస్తుడు అనుకుంటారు. టీ ఎస్టేట్ మేనేజరు (రఘువరన్), తన ప్రియురాలిని బాస్‌కి తార్చి, యిష్టా రాజ్యంగా ఎస్టేట్ ఏలుతూ, అంద మైన పని కత్తెలను తన హస్తాల లోకి రప్పించుకునేందుకు, వేతనాల గురించి ప్రశ్నించే కార్మికులని కొండ లోయలలోకి తోసేందుకు, తన పెంపుడు కుక్కని యధేచ్ఛగా వాడు తూంటాడు. లంచాలు మరిగిన పోలీసువారు, అతిచ వలలో చిక్కిన యజమాని, ఈ మేనేజరు మాటని ఏనాడూ కాదన లేరు. కథానాయ కుడు (మమ్ముట్టి). మేనేజరు జాగిలం నుంచి ఒక పనికత్తెను కాపాడటం, తను బహుమతిగా పొందిన రెండు కుందేళ్లను ఈ మేనేజరు చంపించ డంతో పరిస్థితులు తారస్థాయి నందు కుంటాయి .... జె విన్సెంట్ కెమెరా వర్క్ ప్రశంసనీయం వుంది. దర్శ కత్వం ; విజి తంపి....పిఆర్ఒ : ఫిలిమ్ న్యూస్ ఆనందన్.

పూర్ణోదయా వారి

## 'ఆపద్బాంధవుడు'

'శంకరాభరణం' నుంచి విశ్వనాథ్ చిత్రాలు సాధారణంగా 'యస్' తో

మొదలవుతూ వచ్చాయి ; ఈ సారి మాత్రం 'ఎ' తో. 'హాలికులైన నేమి గహనాంతర సీమల కందమూల కౌద్దాలికులైన నేమి' అంటూ కవితా తృష్ణలో ఉద్యోగం పోగొట్టుకున్న స్కూలు మాస్టరు (జంధ్యాల) కుటుం బానికీ, అమ్మాయిగారు హేమకీ మట్టుకే (మీనాక్షి శేషాద్రి) గాక, మొత్తం చిత్రానికే ఆపద్బాంధవుడు చిరంజీవి. అతని నటనా వైదుష్యమూ, పాత్రో చిత సామర్థ్యమూ, వివిధానేక రూపాల లో ప్రతిభావంతంగా వొప్పించ గల నేర్పు - చిత్రానికి ప్రాణం పోస్తు న్నాయి. కథాప్రారంభానికి ముందు గూడ్సు బండిని హీరో ఆపించి, గోమాత ప్రసవమయాక, రైలు దొంగ లని ఫైటింగ్‌తో హతమార్చి, బుజ్జి దూడతో స్వగ్రామం వస్తాడు ; గంగ, యమున, సరస్వతీలను గర్వంగా హేమకు చూపిస్తాడు. అనాధ బాలుడు మాధవ్‌ని (చిరంజీవి) మాస్టారు చేర దీయగా, పాడిపశువులతో అతను పాలవాడవుతాడు - ఏభైవేలు నిలవ చేయగలిగాడు కాబట్టి పాలవ్యాపారి అనడం సబబు. మాసారూ సత్తిరాజూ (అల్లు రామలింగయ్య) బావా బావ మరుదులు. సత్తిరాజు కొడుకు (శరత్ బాబు), మేసారి రెండో కూతురు హేమ పరస్పరం యిష్టపడుతున్నట్టు కనిపిస్తారు. ఈ హేమ మాధవ్‌కి ఎప్పుడు నేర్పిందో గాని శివుని పాత్ర కట్టడం, నాటకాల డైలాగులతో తర్ఫీదు యివ్వడంతో తూర్పుగోదావరి జిల్లా యాసతో మాటాడే మాధవ్, పాటలూ, పద్యాలూ, దండకాలూ దగ్గిర కొచ్చేసరికి స్వచ్ఛమైన ఉచ్చా రణతో, నాటక పదజాలంతో మెప్పి స్తాడు. 'దక్షయజ్ఞం' లో శివుని పాత్ర ఆ జిలాలో తనే వేయాలి, నూరో, ప్రదర్శన వేళ, తన నాటక విద్య అంతా అమ్మాయిగారి భిక్ష అని వేదిక మీద వెల్లడిస్తాడు. రయిల్వేట్రాక్ ఫైటింగ్, యమ్మెల్యేకి బుద్ధి చెప్పే ఫైటింగ్, బుల్ ఫైటింగ్, మెంటల్ హాస్పటల్ వారర బృందంతో ఫైటింగ్, ఈ ఫైటింగ్‌ల మధ్య పౌరా ణిక దృశ్యకావ్య శోభ, అమ్మాయిగారి కోసం మెంటల్ హాస్పటల్‌లో చేర డం, సీతా రాముల పెళ్లికి తను హను మంతుడవాలనుకొని చివరికి నాయకుడ వటం, యిలా అన్నిటా చిరంజీవి తన నటనా నైపుణితో రసోద్దీపన కలిగి స్తాడు గాని కథలో పటుత్వం లేదు ; వాస్తవికత లేదు ; దర్శకత్వం : కె విశ్వనాథ్, నిర్మాత : ఏడిద నాగేశ్వర రావు.... పిఆర్ఒ : అర్జునరావు.

## గోపీ ఆర్ట్స్‌వారి
## 'దొంగ పోలీస్'

రాయల సీమలో రాటుదేలి, నైజాం వాళ్ల నమ్మకస్థుడై, ఆంధ్రుల అభి మానం పొందిన లారీ డ్రయివరు రాంబాబు (మోహన్‌బాబు) న్యాయంగా సూటీగా పోయేనీతి వర్తనుడు ; ఆధు నిక సినీకథా నాయకునికి కావల్సిన సమస్త సద్గుణాలతో విలసిల్లే సామా హిక శ్రేయోభిలాష. వినాదాలు పలకడుగాని దుష్టత్వాన్ని నిర్భీతితో

ఖండిస్తాడు. పోలీసులు వెనకాడే చోట సాహసంతో ముందుకి దూసుకు పోగల ధైర్యశాలి. కలపలారీలో గంధపు చెక్కలు తీసుకు వెళ్లనసీ, లారీలో తీసుకువెళ్లే సరుకు పట్ల లారీ డ్రయివరుకి బాధ్యత ఉందని, దారిలో చెక్ చేస్తే సంజాయిషీ చెప్పుకోవలసినది డ్రయివరేననీ దగుల్బాజీ పనులలో తలదూర్చననీ బాస్ సాంబయ్యకి (కోట శ్రీనివాసరావు) మొహం మీద చెబుతాడు. ప్రజల నోళ్లు మూయించి, ఊరంతకీ సర్వాధికారై, చట్టాన్ని చుట్టంగా చేసుకు, ఎదురు తిరిగిన ఇన స్పెక్టర్లని హతమార్చే ఒక చక్రవర్తికి, తన బాస్ సాంబయ్య తాబేదారని మొదట ముందుగానీ తెలియదు రాంబాబుకి. ఒకానొక రాత్రివేళ ఏదో ఉపద్రవం తప్పించుకొనేందుకు తమ యింటి మీదికొచ్చిబడ్డ గౌరికి (మమతా కులకర్ణి) ఈ రాంబాబు చెల్లెలు ఆశ్రయమిస్తుంది. ఆ గౌరి, తను పంచర్ల పాంచాలి బంధువునని చెబుతుంది. వెళ్లారాక ఆమెనక్కడ దిగవిడిచి వస్తాడుగాని, గౌరి మళ్లీ ఈ గూటికే వచ్చి రాంబాబు లారీలో క్లీనరు పని సంపాయించు కుంటుంది. ఈ గౌరి, అన్నా వొదినలని సాంబయ్య లోగడ, కామాతురతో హత్యచేసి వున్నాడు - ఆ రహస్యం కూడా రాంబాబుకి ఉత్తరోత్తరాగాని తెలియదు. ఒక హత్యానేరంలో రాంబాబుని సాంబయ్య యిరికించడంతో, తప్పనిసరిగా హీరో తన లారీతో, ప్రియురాలితో పరారి కావలసి వస్తుంది. వెంటాడే పోలీసుల కన్ను గప్పేందుకు, ఆ లారీని లోయ లోకి తోసేసి, చేతి బాంబుతో దానిని మంటల కాహుతి చేసి, జీపులోవున్న పోలీసాఫీసరునిచేసి, యాదృచ్ఛికంగా తను దొంగపోలీసై, నాటకాన్ని రక్తి కట్టిస్తాడు రాంబాబు. పాంచాలి పంచర్ షాపులో అశ్లీలం లేనట్టు ఒక పాత్ర చేత చెప్పించినప్పటికీ ఉన్నదంతా అదే. కలెక్షన్ కింగ్ మోహన్ బాబు విజయపరంపరలో యిది మరొక కలికితురాయి. దర్శకత్వం: కెయస్ ప్రకాష్; నిర్మాత: చలసాని గోపీ; సహనిర్మాత: ప్రమోద్ కుమార్.... పిఆర్ఒ: రాజు.

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మాఅంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము.... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.



## అక్టోబరు 06, 1992

"దక్షిణ భారత చలన చిత్ర పరిశ్రమకు కులపతి కెయస్ ప్రకాశరావు గారి కివ్వడం ఎంతో సముచితంగా ఉంది. స్వయం కృషితో పైకొచ్చి, వినూత్న వరవడి పెట్టిన ఈ అపూర్వ వ్యక్తిని, మాలాంటి వారెందరినో తీర్చిదిదిన సినీ కళాకౌశలుని, 'అపవాదు', 'పత్ని' చిత్రాలతో గూడవల్లి రామబ్రహ్మంగారు ఈ రంగానికి పరిచయం చేశారు. ఆ తర్వాత వీరు తీసిన ద్రోహి, మొదటిరాత్రి, దీక్ష, కన్నతల్లి, మేలుకొలుపు, బాలానందం - అనాటి ప్రేక్షకులని ఎంతో అలరించాయి ; 'ప్రేమ్‌నగర్' ఈనాటి ప్రేక్షకులనీ మెప్పించింది.... 'గృహప్రవేశం' చిత్రానికి దర్శకునిగా యల్‌వి ప్రసాద్‌గారిని బొంబయి నుంచి మద్రాసుకి రప్పించినది ఈయనే! సుశీలకు మొట్టమొదటి ప్లేబాక్ అవకాశం 'కన్నతల్లి'లో యిచ్చినది ఈయనే! నటీనటుల మాట అటుంచి, ఆదుర్తి సుబ్బారావు, వి మధుసూదనరావు, బాపయ్య వంటి దర్శకులను తీర్చిదిద్దినది ప్రకాశరావుగారే! ఈ రంగంలోని అన్ని శాఖలలో ఆయన నిష్ణాతులు. కళా హృదయమూ, సామాజిక స్ఫూర్తితో బాటు గొప్ప మేధస్సు గల మహావ్యక్తి" - అన్నారు పద్మభూషణ్ కె జగయ్య, కళాసాగర్ వారు, రాజా అన్నామలై మండపంలో, ఈ విజయ దశమి పండగ రోజున ఏర్పాటు చేసిన 'శాంతారామ్ అవార్డ్ ఫంక్షన్' సందర్భంగా ('మన సత్యం')....

"1950 లలో కమ్యూనిస్టులుగా ముద్రపడ్డ నాలాంటి వారెందరికో సినీ రంగంలో ఆశ్రయమిచ్చి కాపాడారు కెయస్ ప్రకాశరావుగారు" - అన్నారు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి .... "ఇరవై రూపాయిలు చేతిలో పెట్టి, నన్ను మద్రాసు రప్పించి, స్టిల్ కెమారామాన్‌గా చేసింది ప్రకాశరావు గారు" - అన్నారు 'మన సత్యం'.

"సర్వసాధారణంగా ఈ సన్మాన సభలలోని ముఖ్యాంశం పొగడటం, పొగిడించుకోవటం.... 'సత్యం' మాట తీసేయకలేక వచ్చాను. నాకు ఈ పురస్కారాలు గిట్టవు - కాని, ఒక్కో సారి తప్పనిసరి అవుతోంది - అవతల

వారితో గల వ్యక్తిగతానుబంధం వల్ల మెత్తబడట మవుతోంది.... తాపీ ధర్మారావు, కొడవటిగంటి కుటుంబ రావు వంటి సాహితీపరుల వద్ద నుంచి నేను ఎన్నో నేర్చుకున్నాను - కొన్ని ప్రయోగాలు చేశాను. ప్రేక్షకాభిరుచి ఎప్పుడూ సంఘ స్వరూపం నుంచి, సామాజిక సమస్యల నుంచి ఉత్పన్న మవుతుంది. ఆనాటి పరిస్థితులు వేరు - నేటి పరిస్థితులు వేరు. ఆ పరి స్థితుల ప్రభావం వల్లనే అభిరుచులు మారుతాయి. ఇందులో చెడిపోవటం, బాగుపడటం అంటూ ఏమీ లేదు. అధిక సంఖ్యాకులని ఆకట్టుకొనే శక్తి సినీ మీడియమ్‌కి ఉంది'' - అన్నారు కెయస్ ప్రకాశరావు.... పద్దెనిమిదేళ్ల క్రితం తను రచించిన 'గోడ గడియా రం', 'విశాఖపట్నం - సౌజన్య కళా స్రవంతి' మద్రాసులో ప్రదర్శించే అవకాశాన్ని కలిగించిన కళాసాగర్‌కి, కార్యదర్శి శుభాన్‌కి కృతజ్ఞతలు తెలి పారు బలివాడ కాంతారావు. (రామా రావు, వేణు, నాగేశ్వర రావు, అప్పల స్వామి, ప్రసాద్, శ్రీనాథ్, జగదీశ్వరి, లక్ష్మీకాంతమ్మ, గుడిపాటి లక్ష్మి ఈ నాటకంలో పాల్గొంటున్నారు - దర్శకత్వం : ఎమ్‌వి ఆచార్య).

పదమూడవ ఏట నాటక రంగం లో, ఆ తర్వాత బాబూరావు పెయిం టర్ ప్రోత్సాహంతో 1925లో సినీ రంగంలో ప్రవేశించి, ప్రభాత్ ఫిలిమ్ కంపెనీ బేనర్లో అయోధ్య రాజు, పడోసి, డాక్టర్ కోట్నీస్, అద్మి వంటి చిత్రాలు నిర్మించి, ఆ తర్వాత 'రాజ్ కమల్ కళా మందిర్' పేరుతో దో ఆంకె బారా హాత్, నవ్‌రంగ్, ఝనక్ ఝనక్, శాకుంతల వంటివి తీసిన పద్మభూషణ్ శాంతారామ్, జాతీయ అంతర్జాతీయ ఖ్యాతి పొందిన సినీ కళా శిల్పి. 'ఆద్మీ' చిత్రానికి ఎంతో స్పందించి, కొత్త శక్తి తెచ్చుకున్న 'మన సత్యం' మంచిని పెంచేం దుకు తహతహలాడే 'మన సత్యం' ఆరాధ్యుడైన శాంతారామ్ గౌరవ స్మృతిగా స్థాపించిన ఈ అవార్డ్‌ని పోయిన సంవత్సరం డైరక్టరు శ్రీధర్‌కి యిచ్చారు ; ఈ సంవత్సరం కులపతి కోవెలమూడి సూర్య ప్రకాశరావుకి.

..... 09

''ఏదో విధంగా మనం ప్రతినెలా కలుసుకుంటూనే వున్నాం. ఇది నా 527వ చిత్రం. పైట్సూ, పాటలూ, ట్రయిలరూ మీరు చూశారు. దీని పేరు 'మరో యుద్ధకాండ' ; పేరులో 'యుద్ధం' వున్నప్పటికీ, ప్రేమ, త్యాగం, సెంటిమెంటూ, మానవతా విలువలు, ధర్మంకోసం, న్యాయం కోసం పోరాటం వున్నాయి. విజయ కాంత్ పోలీసు ఆఫీసరు ; శరత్ కుమార్ కథానాయకుడు ; మోహిని నాయిక. ఈ అనువాద చిత్రంలోని యితివృత్తం మనసు నాకట్టుకుం టుంది'' - అన్నారు రాజశ్రీ, ఎపియన్ థియేటర్లో, పాత్రికేయులకి ఈ పిక్చ ర్లోని కొన్ని ఘట్టాలు చూపించాక !.... అనువాద చిత్రాలకు తగు గుర్తింపు రావటం లేదు ; అలాగే డబ్బింగ్

ఆర్టిసులను కూడా గుర్తించడంలేదు ; ఈ పరిస్థితి మారాలి - అన్నారు ఈ చిత్రంలో గొంతు నిచ్చిన ఆర్టిస్ట్.... ఉడిపి మార్కెట్‌లోని ద్వంద్వ యుద్ధం, మాల్పే, ఆలైప్పుళై, మంగుళూరు మొదలైన ప్రదేశాలలో గల రమణీయ దృశ్యాలతో బాటు పద్దెనిమిదడుగుల సొరచేపతో శరత్ కుమార్ ఫైట్ చేయడం ఈ చిత్రంలో ఒక హైలైట్. ఇళయరాజా సంగీతం. అనూరాధ నృత్య దర్శకత్వం. ఇలవరసన్ ఈ తమిళ మాతృకకు దర్శకులు. మన్సూర్ ఆలీఖాన్, సిల్క్‌స్మిత, యువశ్రీ మున్నగు వారున్న ఈ సినిమాస్కోపు చిత్రానికి రచన : రాజశ్రీ ; నిర్మాత : జె రామ్మోహన్ రెడ్డి ; సహ నిర్మాత : సి యువ రాజు ; ప్రొడక్షన్ : మధు ఫిలిమ్స్ డివిజన్.... పిఆర్ఓ : అర్జునరావు.

. . . . . 13

అమెరికన్ సెంటర్లో, అధ్యక్ష ఎన్నికల ప్రథమ చిత్రమా (రిపబ్లిక్ బుష్, డెమొక్రాట్ క్లింటన్‌ల పోటీ లోని వాదప్రతివాదాలు), శర్వాణీ సంగీత సభవారి జయంతీ కృష్ణన్ వీణ కచ్చేరీయా - దేనికి ? - అని అనుకుంటూండగా, వసంతా రామ కృష్ణ ఫోన్ చేశారు. 'నిన్న గీతా సిస్టర్స్ బాగా పాడారు - మీరు రాలేదేమి ?' అంటూ 'అనుకోకుండా ఎవరో అతిథులు హైదరాబాదు నుంచి వచ్చారు ఇవ్వాళ తప్పకుండా వస్తాను' - అని చెప్పాను.... 'బియస్ఆర్'ని చూసి వారం పదిరోజులయింది కదా అని వారింటి వద్ద ఆగాను - ఖాళీగా అంటె ఆయనని కూడా రమ్మన మందామని ! ఒక్కరం కూచునే బదులు, మిత్రులెవరైనా తోడుగా వుంటే, యింకా ఎక్కువ ఎంజాయ్ చేయ గలుగుతాం.... జయంతీ కృష్ణన్ బాలచందర్ శిష్యురాలు. ఈమె వాయిస్తున్నప్పుడు ఆ వరవడి మనకు స్ఫురిస్తుంది. గాత్రమూ, వాద్య మూలో గాత్ర సంగీతానికి సాహిత్యం సహాయకారిగా ఉంటుంది ; ఇక వాద్య సంగీత మంటే రాగ తాళ లయలు, శబ్దవాహినిలోని సౌందర్య లతలూ ప్రధానమవుతాయి. చాలా మంది సంగీతజ్ఞులు గాత్ర సంగీతం కంటె వాద్య సంగీతం గొప్పదనీ, అందులో విద్యా ప్రౌఢిమ ఎక్కువ వున్నదనీ అంటారు - స్థూలంగా వచనమూ, కవనమూ పూదిరి ! జయంతీ కృష్ణన్ వీణ వింటున్నప్పుడు, మనసు ఒక ఉద్యానవనంలో విహరిస్తున్న భావన కలుగుతుంది.

. . . . . 16

అమెరికన్ రాజ్యాంగం ప్రకారం ఏ అధ్యక్షుడూ రెండు పదవీ కాలాలకు మించి ఆ స్థానంలో ఉండ కూడదు గనక, తనది ఒక పదవీ కాలం (నాలుగేళ్లు) మాత్రమే అయింది గనక, బుష్ రెండవసారి పోటీ చేస్తున్నారు. 1924లో జన్మించిన బుష్, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో పసిఫిక్ రంగాన అమెరికన్

నౌకదళ పైలట్‌గా 'ఫ్లయింగ్ క్రాస్' పొందారు. ఈ ఏల్ యూనివర్సిటీ ఎకనమిక్స్ పట్టభద్రుడు, కొంత కాలం టెక్సాస్ ఆయిల్ బిజినెస్‌లో గడిపి, 1966లో రిపబ్లికన్ పార్టీ తరఫున ప్రతినిధుల సభకు ఎన్నికయాడు. బుష్ తండ్రి ప్రెస్కాట్ 1962-72 కాలంలో కానెక్టికట్ నుంచి సెనేటర్. ఆ తర్వాత, బుష్ ఐక్య రాజ్య సమితిలో అమెరికా దూతగా (1971 - 73), పీపుల్స్ చైనాలో దౌత్య ప్రతినిధిగా (1974-75), సి ఐ ఎ (సెంట్రల్ ఇంటిలిజెన్స్ ఏజన్సీ) డైరక్టరుగా (76-77) పని చేసి, 1980లో అధ్యక్ష స్థానానికి పార్టీలో తగు మదతు లభించని కారణంగా, ఉపాధ్యక్ష పదవికి నెగ్గాడు. ఎనిమిదేళ్ల పాటు రొనాల్ రీగన్ అధ్యక్షుడు, జార్జి బుష్ ఉపాధ్యక్షుడు. 1988లో అమెరికన్ ప్రజలు అనుభవజ్ఞుడైన జార్జి బుష్‌ని తమ దేశాధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

ఇక, క్లిన్టన్. జార్జి బుష్ రెండవ ప్రపంచ యుదకాలపు మనిషైతే, నలభైఅయిదేళ్ల బిల్ క్లిన్టన్, వియత్నామ్ వార్ నాటి వ్యక్తి. స్టూడెంట్‌గా వైట్ హవుజ్‌కి వెళ్లి, జాన్ కెన్నడీకి షేక్‌హాండ్ యివ్వడం తన జీవితంలో మరుపురాని ఘట్టంగా భావిస్తాడాయన. చిన్నవయసులో సెనేటర్ ఫుల్

# 'జగతి' చందా కూపను

2, కెవేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు - మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్ట్ లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..........................................

అడ్రసు ..........................................

..........................................

..........................................

తేదీ : సంతకం

బ్రయిట్ వద్ద పని చేసిన క్లింటన్, రోడ్స్ స్కాలర్‌షిప్ మీద, ఇంగ్లండు లోని ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటిలో చదువుకునొచ్చి, ఏల్ యూనివర్సిటీలో న్యాయశాస్త్ర పట్టం పొందు తాడు. 'లా' ప్రాక్టీస్ చేస్తూ, 1974లో కాంగ్రెస్‌కి పోటీ చేసి ఓడి పోతాడు; 1976లో అర్కన్సాస్ 'అటార్నీ జనరల్' అవుతాడు, 1978లో గవర్నరు. లా కాలేజీ రోజుల్లో సహాధ్యాయిని హిలరీని పెళ్లి చేసుకున్నాడు. డెమొక్రాటిక్ పార్టీ గవర్నరుగా పన్నెండేళ్లపాటు పని చేశాడు. ప్రజారోగ్యము, పర్యావరణము, విద్యాపద్ధతులు - యిలాంటి వాటిలో ప్రజల మెప్పు పొందే సంస్కరణలు ఆచరణలో పెట్టాడు.

గల్ఫ్‌వార్, గన్‌కంట్రోల్, విదేశాంగ విధానం మున్నగు వాటిలో రిపబ్లికనులకి, డెమొక్రాట్లకీ అంతగా అభిప్రాయ భేదం లేదు. కాని, దేశీయ సమస్యల విషయంలో మాత్రం దృక్పథాలు భిన్నంగా ఉన్నాయి. వీరిద్దరూ గాక అధ్యక్ష స్థానానికి పోటీలో మూడవ వ్యక్తి, ఇంటిపెండెంట్‌గా రాస్ పెరో. ఎలక్ట్రానిక్స్ బిజినెస్‌తో అతి భాగ్యవంతుడైన ఈ పెరో అమెరికాలోని పాతికమంది మల్టీ మిలియనీర్స్‌లో ఒకడు. పార్టీ సిద్ధాంతాలకు బద్ధుల వడంగాక, ఏ సమస్యనైనా వాస్తవిక దృష్టితో, ఆచరణయోగ్య మగు పద్ధతిలో పరిష్కరించాలనీ, లోటు బడ్జెటూ, డ్రగ్ ట్రాఫికింగ్, సరుకులు కొన్నట్టే తుపాకులు కొనడం యిలాటివి నిరోధిస్తాననీ ఈయన అంటారు.

'సాధారణంగా రిపబ్లికనులూ డెమొక్రాట్లే అధ్యక్షస్థానికి పోటీ చేస్తారు. ఈసారి ఈ పెరో కొత్తగా వచ్చాడు' - అని చాలామంది అనుకుంటారు. అది కరెక్ట్ కాదు. 1988లో పదిహేడుగురు అధ్యక్ష స్థానానికి పోటీ చేశారు; ఈసారి పై ముగ్గురూ గాక ఇరవైనాలుగు మంది వున్నారు. అయితే, బలాబలాలపోటీ రిపబ్లికనులకీ, డెమొక్రాట్లకీ మధ్యనే జరుగుతుంది. మనం దేశంలోకి మల్లేనే అక్కడా అనేక పార్టీలు అవతరిస్తూంటాయి. కోల్డ్ వార్ రోజులలో, అమెరికన్ కమ్యూనిస్ట్ పార్టీ తరపున 'గస్‌హాల్' ప్రెసిడెంట్ పదవికి పోటీ చేశాడు. నల్లవారు, తెల్లవారు విడివిడిగా ఉండాలనే 'డిక్సీక్రాట్స్' తరపున జార్జివాలెస్ ఒకసారి పోటీ చేశాడు. ఇలాటి ఉదంతాలు అనేకం ఉన్నాయి.

ఇవ్వాళ అమెరికన్ సెంటర్లో ఆహ్వానితులకు 90 ని॥ల రెండవ 'ప్రెసిడెంషల్ డిబేట్' చూపారు. పదిహేనవ తేదీన కాపిటల్ హిల్‌లో జరిగిన చర్చ యిది. బుష్, క్లింటన్ చెరోవైపున, మధ్యని పెరో, ఇద్దరూ విధాన న్యాయంలోని లోటుపాట్లు సీరియస్‌గా చెబుతూంటే, 61 ఏళ్ల పెరో హ్యూమర్ సప్లయి చేసి, చర్చలో పాల్గొంటున్న 208 మందినీ నవ్వించేవాడు. మోడరేటర్ ఈ 90 ని॥ల చర్చని ఎంతో సమర్ధవంతంగా నిర్వ

హించింది. మధ్య వయసులోని అమెరికన్ స్త్రీ పురుషులు, తాము అడగదలుచుకున్నది నిర్భయంగా అడిగేవారు ; ముగ్గురూ ఒకరి తర్వాత ఒకరుగా, తాము ఏమి చేయదలచు కున్నదీ వివరించేవారు. ఎకానమీ అస్తవ్యస్తంగా వున్నమాట కాదన లేనిదని, బయట ప్రపంచపు బాధ్యతల వల్ల అనుకున్నవి కొన్ని జరగలేదనీ, నిరుద్యోగుల సంఖ్య పెరిగిన మాట నిజమేననీ బుష్ అనగా, ఇరాక్ విషయంలో కరెక్టేగాని యుగో స్లావియా దగ్గిరకొచ్చేసరికి అమెరికా తన బాధ్యత సక్రమంగా నెరవేర్చలేక పోయిందనీ, పన్నులు పెంచబోమని హామీ యిస్తూనే పెంచారనీ, దేశ ప్రజల ఆరోగ్యావసరాలు అలక్ష్యం చేస్తున్నారనీ క్లింటన్ చెప్పగా, మేనేజి మెంట్ సక్రమంగా లేకపోవడం వల్లనే అవకతవకలు ఏర్పడుతున్నాయని, తనకొకసారి ఛాన్స్ యిచ్చి చూడమనీ అన్నాడు పెరో.

నవంబరు 3వ తేదీన అమెరికన్ ప్రజలు తమ అధ్యక్షుని ఎన్ను కుంటారు. నెలరోజుల తర్వాత 538 మందిగల 'ఎలక్టరల్ కాలేజీ'లో ఈ ఎన్నికను బలపరచాలి - అంటే కనీసం 270 మంది అయినా సుముఖంగా ఓటు చేయాలి. డిసెంబర్ నెల రెండవ బుధవారం తర్వాత వచ్చే సోమవారం నాడు పార్టీ అధికార ప్రకటన వెలువడుతుంది. జనవరి 6వ తేదీ ఉదయ సభల సంయుక్త సమా వేశంలో, అమెరికన్ సెనేట్

ప్రెసిడెంట్, ఎవరు అధ్యక్షులుగా ఎన్నికైనదీ ప్రభుత్వపరంగా వెల్ల డిస్తాడు.

. . . . . 18

ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ (Indian Council for Cultural Relations) తమిళ నాడు రాష్ట్ర ప్రభుత్వమూ సంయుక్తం గా టిటికె ఆడిటోరియమ్‌లో ఏర్పాటు చేసిన, మూడురోజుల 'సార్క్' (Saarc) దేశాల ఫెస్టివల్‌లో, యివ్వాళ బంగ్లాదేశ్ నాట్య ప్రదర్శనలు. తమిళ నాడు విద్యామంత్రి అరంగనాయకమ్ దీపారాధన చేశాక, ప్రముఖ విద్వాంసు రాలు సరస నట్టువాంగమ్‌తో, సర సాలయ నాట్యకళా కారిణులు పుష్పాం జలితో బంగ్లాదేశ్ బృందానికి స్టేజి మీద సుమనోజ్ఞంగా స్వాగతం తెలి పారు.

సంగీత నాట్యాదులు ఒక జాతి సంస్కృతికి ప్రతీకలు, ప్రతి సమా జమూ కొన్ని సృజనాత్మక మానవతా విలువలని, తన మనుగడకి, లోక హితానికి దోహదకారిగా భావిస్తూ, వాటినెంతో భద్రంగా కాపాడు కుంటుంది - దానినే మనం సంస్కృతి అంటున్నాం. ఈ సంస్కృతి అనేది భౌగోళిక, పర్యావరణ, పురావస్తు ప్రభావాలకి లోనవుతూ, తరతరాల ప్రాచీన ప్రమాణాలను, కాలాను గుణంగా మలుచుకుంటుంది. దక్షిణ ఆసియా దేశాలన్నిటా - సంప్రదాయ సామీప్యత స్పష్టంగా కనిపిస్తుంది — దాని ముద్రే, లలిత కళాల మీద ఉంది. పారిశ్రామిక విప్లవానంతరం పాశ్చాత్య నాగరికతా ప్రభావం, ప్రపంచ వ్యాప్తంగా అలుముకున్నప్ప టికీ అది పట్నవాసులకే పరిమితమై, గ్రామీణ జీవితాలలోకి చొరపడలేదు. అరవై వేల గ్రామాలు గల బంగ్లాదేశ్, ఈ ఉపఖండ విభజనానంతరం, తూర్పు పాకిస్థానై, పశ్చిమ పాకిస్థాన్ జులుమ్ అధికంకాగా, తొమ్మిది నెలల 'ముక్తివాహినీ' పోరాటంతో స్వాతం త్ర్యం పొందింది. బంగ్లాదేశ్‌ని ఒక సర్వస్వతంత్రరాజ్యంగా ప్రప్రథమ సాధికార గుర్తింపునిచ్చిన రాజకీయ చతురత ఇందిరాగాంధీది. ఒక తరం వెనకటి వంగదేశీయులు, ఇప్పుడు బంగ్లాదేశీయులు రాజకీయంగా! కాని, సాంస్కృతికంగా పశ్చిమ బెంగాల్‌కీ వారికీ ఎంతో సాన్నిహిత్యం ఉంది.

బంగ్లాదేశ్ కళాకారుల మొదటి నృత్యం రవీంద్రనాథ్ టాగూరు 'నిరీక్షణ' (Expectation) అర్ధ రాత్రి వేళ హెూరున వర్షం పడుతూ వుండగా, ఆ చీకట్లలోకి ఆశగా చూస్తున్నాడతను. ఆ నిశీధిలో, నీటి ధారల మధ్య, మేలిముసుగుతో ఒక సుందర వదనం సాక్షాత్కరించింది. తనివితీరా చూస్తున్నాడు. కాని, ఎలా కనిపించిందో అలాగే మాయమయింది; తన విషాదం తనకి మిగిలింది.... ఈ మర్మకవితలోని (మిస్టిసిజమ్) అంతరార్థం ఏమిటంటే, 'వేదన నుంచి విముక్తి' పొందమని. ముగ్గురు యువకులు నీలం బట్టలూ, ముగ్గురు

యువతులు తెల్లటి నేత చీరల మీద నెమలి పచ్చ బ్లవుజులూతో ఈ నాట్యాన్ని ఎంతో చక్కగా చూపించారు.

ఆ తర్వాత స్నేక్ ఛార్మర్, బోట్ మాన్, పాలో కులా, ఛట్కు, సారీ డాన్స్ - యిలా పల్లీయుల జీవితాన్ని వారి జీవన పోరాటాన్ని, చలికాలంలో చేపలు పట్టడం, దూరం వెళ్లిన తమ పురుషులరాకకోసం కళ్లలో వొత్తులు పెట్టుకు చూసే వనితలు, హుస్సేన్ ఖాన్ భరతనాట్యం వెడ్డింగ్ డాన్స్ - ప్రతి అయిటమూ కూడా రక్తిమతో రంజనతో ప్రేక్షకులని అలరించింది. ముఖ్యంగా నజ్రుల్ ఇస్లామ్ కంపోర్ చేసిన 'లిబరేషన్' (విమోచన), సూర్యబింబం గల పతాకానికి వందన సమర్పిస్తూ స్టేజీ మీద డాన్సు చేస్తున్నప్పుడు, హాలులో సగం మంది, ఆ డాన్సుకి తాళం వేశారంటే, ప్రేక్షక హృదయాన్ని అదెంతగా ఆకట్టుకున్నదో తెలుసుకోవచ్చు .... ఈ బంగ్లాదేశ్ బృందం కోరడంవల్ల 'కళా క్షేత్ర' వారు తిల్లానాతో మూడు అయిటమ్స్ వారి కోసం ప్రదర్శించారు.

ఇరవై నలుగురు గల ఈ ట్రూప్‌కి, బంగ్లాదేశ్ శిల్ప కళా అకాడమీ సెక్రటరీ తాజ్ మహమ్మద్, లీడరు. జెస్సూర్ కాలేజీ లెక్చరరు, జాతీయ వనితా మండలికి అధ్యక్షురాలు అయిన నరీస్ బేగమ్ ఈ బృందానికి కోఆర్డినేటర్. గాత్రానికి ముగ్గురు, వాద్యాలకి నలుగురు గాక, పదముగ్గురు, ఆర్టిస్టులు, ఒక టెక్నికల్ డైరెక్టరు, ఒక మేనేజరు.... ఇందులో కొందరు పోస్ట్ గ్రాడ్యుయేట్స్, కొందరు డిప్లోమా హోల్డర్స్, కొందరు సాంకేతిక నిపుణులు. మొత్తం మీద అందరూ బాగా చదువుకున్నవారూ అనేక దేశాలు పర్యటించిన వారూను

మన సంప్రదాయ నృత్యాలకీ, వీటికి తేడా ఎక్కడంటే, ఇవి జానపదుల జీవితం నుంచి ఊపిరి పోసుకున్నవి. ఆ హావభావ ప్రదర్శనల లోను, శారీరక కదలికల లోను గల జవము, జీవమూ మనసుని ఆహ్లాదపరుస్తాయి. సార్వజనీనత అధికంగా కనిపిస్తుంది. పిల్లనగ్రోవి, ఏకతార, డోలక్ వంటివి పాటగానికి, వాద్యానికి, ప్రకృతికి ఒక సమతుల్యత (harmony) చేకూరుస్తాయి. చిట్టగాంగ్ కొండల నుంచి, దీనాపూర్ సంతాల్ జాతుల నుంచి వుద్భవించిన కళా రూపాలు బంగ్లాదేశ్ సంస్కృతిలో ఒక భాగం.

. . . . . 20

'సార్క్' అనగా బంగ్లాదేశ్, భూటాన్, ఇండియా, మాల్దీవ్స్, నేపాల్, పాకిస్థాన్, శ్రీలంక. దక్షిణ ఆసియాలోని ఈ ఏడు దేశాల మధ్య పరస్పర సహకార సమాఖ్య. 1989 నాటి ఇస్లామాబాద్ సమావేశంలో, ప్రభుత్వాల మధ్య సంప్రదింపులే గాక, ప్రజల మధ్య సాంస్కృతిక బంధం ఏర్పడాలన్నారు రాజీవ్‌గాంధీ. ఇన్నాళ్లూ స్తబ్ధుగా వున్న సూచనకు, 'పివి' ప్రధాని అయాక ఊపిరిపోశారు.

హెచ్ఆర్ దాసు, నిఖిల్ చక్రవర్తి 'మీడియా డైలాగ్'కి కో-ఆర్డినేటర్లు ....టిటికె ఆడిటోరియమ్‌లో యివ్వాళ పాకిస్తాన్ బృందం భంగ్రా, ఖటక్ డాన్సులు కలర్‌ఫుల్‌గా ప్రదర్శించింది. అందరూ పురుషులే, ఈ బృందంలో ఒక్క స్త్రీ కూడా లేదు. నిన్నటి భూటాన్ బృందం ప్రదర్శన అలా కాదు - స్త్రీ పురుషు లిరువురూ వున్నారు: బుద్ధజాతక కథలకు చెందిన ముసుగు నృత్యాలు, పురాణాలు వింటే పుణ్యం వస్తుందని మన వాళ్లు ఒకప్పుడు నమ్మినట్లే, భూటాన్ వారికి పవిత్ర నృత్యాలు చూస్తే పుణ్యం వస్తుందనీ, పద్మ సంభవుని దయా కిరణం తనుపై ప్రసరిస్తుందనీ నమ్మకం.

పాకిస్తాన్ బృందానిది ఇంటర్వెల్ ముందు ఒకటి తర్వాత ఒకటి - రెండే డాన్సులు .... వలయాకృతి నాట్యం, కత్తిసాము, ముగ్గురు వాద్యకారుల పాటకు దీటైన కదలికలు .... నిన్నటి భూటాన్ ప్రదర్శనలో ఎనిమిది రుద్ర భూములలో పిశాచాలని మచ్చిక చేసుకోవటం, నాగరాక్షసిని తరిమి ప్రజలను కాపాడటం. గురువు అనుచరులు నూర్వురు దేవతలవటం, ద్రవ్యనిధుల కంటె దయానిధి గొప్పదని పద్మసంభవుని బోధలు, డప్పు - కర్ర - కత్తితో దుష్టశక్తులని దూరం చేసి ఆత్మ పారిశుధ్యం పొందటం - మొత్తం అయిదు అయిటమ్స్. భూటన్ డాన్సులలో తాంత్రిక ముద్ర కనిపిస్తుంది. ఈ మూడు రోజుల ప్రదర్శనలో, ఏ దేశానిది మిమ్మల్ని మెప్పించి మనసుకి హత్తుకున్నది ? - అనే ప్రశ్న వేస్తే, అందరూ ఏకకంఠంతో 'బంగ్లాదేశ్' అంటారు. అయితే, ఏవరి నృత్య రీతులు వారివి. ప్రజల మధ్య పరస్పర మైత్రీభావం నెలకొల్పేందుకే ఈ మాదిరి ఫెస్టివల్స్. ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్సూ (ప్రాంతీయ డైరెక్టరు : కె వాసుదేవన్), తమిళనాడు ప్రభుత్వ సాంస్కృతిక శాఖ (అవ్వయ్ నటరాజన్) ఈ సత్సంబంధ స్థాపనకు అభినందనీయగు కృషి చేశారు.

—యన్నార్ చందూర్

---

తన నీడ నుంచి తాను పారిపోవాలని మనిషి పరిగెడితే, నీడ వొదులుతుందా, వృక్షచ్ఛాయలో అది లీనమయేదాకా !

☘ ☘ ☘

చేపలు పట్టడం రిటైరైన వారి సరదా - చేపని ప్రాణంతో వుంచడమా మానడమా అనేది వారి అధీనంలోని శక్తి. చదరంగం చక్కటి కాలక్షేపం - కాని, ఆడేవారిలో ఉన్నది యుద్ధాసక్తి.

☘ ☘ ☘

తన గతాన్ని, వర్తమానాన్ని రెండు పిడికిళ్లతో బిగించినప్పటికీ, పిడికిలి తెరవక తప్పదు. చంద్రకిరణాలని, మలయమారుతాన్ని చేతి బెత్తంతో ఆపినప్పటికీ, దానికవి అంటుకోవు. —చైనీయ సామెతలు

---

# కొత్త పుస్తకాలు

'ప్రజా సాహితి' - 'కన్యాశుల్కం' ప్రదర్శన శతజయంతి సంచిక. వర్కింగ్ ఎడిటర్: నిర్మలానంద, 29 - 28 - 67 దాసరి వారి వీధి సూర్యారావు పేట, విజయవాడ - 2 .... వెల : రు 10-00.

భావగర్భితమైన బాపు ముఖచిత్రంతో, 'కన్యాశుల్కం'లోని పాత్రల విశిష్టత, ఆనాటి సామాజిక స్థితిగతులు, గురజాడ సాహిత్య కృషి మున్నగువాటి గురించి సవివరంగా నేటి పాఠకునికి చెబుతోందీ ప్రత్యేక సంచిక.

గురజాడ శతజయంతి 1982 లో జరిగింది; కన్యాశుల్కాన్ని 1892 అగస్టు 13 వ తేదీన విజయనగరం జగన్నాథ విలాసినీ నాటక సమాజం వారు, ఆనంద జగపతి ప్రభువు సమక్షాన ప్రదర్శించారు. తొలిప్రతి అయిదు అంకాలు, ముప్ఫయి రెండు రంగాలూతో 1897 లో అచ్చయింది. నాటక కర్తే స్వయంగా చేసిన మార్పులూ చేర్పులూతో, ఏడు అంకాల ముప్ఫయిమూడు రంగాల రెండవ కూర్పు, మొదటిదానికి నాలుగింతలు పెరిగి, మధురవాణీ గిరీశాలు మరుపు రాని పాత్రలుగా, 1909 లో వెలువడింది.

ఒక నాటకానికి శతజయంతి జరపడం చాలా అరుదైన విషయం. కాని, 'కన్యాశుల్కం' విషయంలో ఆశ్చర్యపడనవసరం లేదు. తెలుగు నాటక రంగానికి కొత్త ఊపిరి పోసి, తెలుగు సామాజిక జీవితాన్ని తట్టిలేపి, తెలుగు భాషకు బంధవిముక్తితో తేజాన్ని తెచ్చిన సాహితీ సౌగంధికమది.

ఈ సంచికలోని పాతిక రచనలలో ప్రతి ఒక్కటీ పరిశీలనాత్మక దృష్టి గలది. 'Girisam must have taken the author himself by storm and argued and bluffed his way into the drama.' అన్న యస్సెమ్‌వై శాస్త్రి మాటలని నవీన్ ఉదాహరించగా, 'విప్లవాల్ని డాలర్లలోకి మార్చుకొని - మానవత్వాన్ని వ్యాపారంతో సంస్కరించే గిరీశాన్ని - మనమిప్పుడు పోల్చుకోలేం' - అంటారు వసీరా.

'పూటకూళ్లమ్మ ఇంటినుంచి వీధిని పడ్డ గిరీశం విజయనగరంలో అబోరు దక్కదని వెంకటేశంతో కృష్ణరాయపురాగ్రహానికి బిచాణా యెత్తాడు. విజయనగరంలో జీవనం గడవక మధురవాణి రామప్ప పంతుల్తో రామచంద్ర పురాగ్రహారానికి వెళ్లింది'

(కాకరాల) .... ఆ నేపథ్యంలో ఈ రసవత్తర గ్రంథం నడిచింది.

'మధురవాణి ఒక సుభాషిణి, ఒక చతుర సంభాషిణి, ఒక చమత్కార వాహిని' - అని సంజీవదేవ్ మెచ్చుకోగా, 'మృచ్ఛకటికం నాటకాన్ని కొల్లగొట్టి కన్యాశుల్కాన్ని సృష్టించిన గురజాడ మధురవాణి కంటితో ఉత్తర కథనంతటినీ నడిపించేడు' - అనే యమ్ ఎ నరసింహమూర్తి, కొండు భట్టీయం, బిల్హణీయం అసంపూర్ణంగా మిగల్చడమే మంచి దయిందంటారు. "వేశ్యల పట్ల, విధవలపట్ల అతని కారుణ్యం అపారమైనది, అలవికానిది. .... 'మీ పేరేమిటి' కథలో అఖండ విజయాన్ని సాధించేడు ; కవితల్లో యింకా స్వేచ్ఛగా కదను తొక్కాడు .... వాడుక భాష, సంఘ సంస్కారం - ఆయన సామగ్రి' అని చెబుతారు నరసింహమూర్తి.

'వేశ్యకూతురు వేశ్యగాక మరొక విధంగా బతికే అవకాశం ఆనాటి సమాజంలో లేని కారణాన మధురవాణి వేశ్య అయింది' - అంటారు స్త్రీ పాత్ర చిత్రణ ముచ్చటిస్తూ జి భవాని.

బిపిన్ చంద్రపాల్, బంకిమ్ చంద్ర, అరవింద ఘోష్ వంటివారు భారత దేశానికి మాతృ స్వరూపం ఇవ్వగా, గురజాడ 'దేశమంటే మట్టి కాదోయ్ - దేశమంటే మనుషులోయ్' అని హెచ్చరిస్తూ, మానవతా వాదానికి పట్టం గట్టారు.

'గురజాడను స్మరించుకుంటే, అవసరాల స్ఫురణకు వస్తాడు' - అని జయంతి రామ లక్ష్మణమూర్తి చెప్పినది నూటికి నూరు పాళ్లు నిజం. అవసరాల సూర్యారావు అద్వితీయ కృషి వల్లనే గురజాడ రచనలన్నీ వెలుగు చూశాయి ; అంగ్లంలో ఉన్నవి తెలుగులోకి అనువాదం పొందాయి.

'అన్ని వేదాల్లోనే ఉన్నా యష !' అని వందేళ్ల క్రితం గురజాడ అనిపించిన మాట, యిప్పటికీ మన చెవుల పడుతోంది. తెలుగువారి ఆధునిక యుగ వికాసానికి ఆద్యుడైన గురజాడ, 'ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును' అని ఒక చిన్న ముక్కలో ఎంతటి గొప్ప సత్యాన్ని చెప్పారో ! .... 'మతములన్నియు మాసి పోవును - జ్ఞాన మొక్కటి వెలిగి నిలుచును'.

ఈ సంచిక వెలువరించటంలో ఎడిటర్ నిర్మలానంద ప్రశంసనీయమగు కృషి చేశారు.

—దయానిధి

బర్మా ఆంధ్రులు - రచన : భీశెట్టి లక్ష్మణరావు. ప్రచురణ : సాధనా పబ్లికేషన్స్, బర్మాకాలనీ, విజయవాడ - వెల : రు 30-00

'కడుపు చేత బట్టుకొని, కట్టెలు కొట్టే కార్మికులుగా - 'అమ్మా నాన్నా' విశాఖజిల్లా యలమంచిలి నుంచి రంగూన్‌కి వలస వెళ్లారు' - అంటారు రచయిత, తల్లి దండ్రులకు ఆరాధన దీపికగా, అన్నా-తమ్ముడికి అనురాగ

మాలికగా సమర్పించిన ఈ పుస్త కానికి ప్రారంభ వాక్యాలుగా. 1964 జులై 29 వ తేదీన. బర్మాలోని రాజకీయ కారణాలుగా, వారి కుటుంబం ఇండియా వచ్చేయవలసి వచ్చింది; అదే సంవత్సరం నవంబరు 25వ తేదీన విజయవాడలోని 'ఆంధ్రపత్రిక' లక్ష్మణరావుకి ఆశ్రయ మిచ్చింది. జాబ్ చేస్తూనే ఎన్నో సినిమాలకు కథలు రాశారు; అఖండ విజయం సాధించినవి మూడు - శతదినోత్సవం చేసుకున్నవి పదకొండు. ఆ చిత్రాల పేర్లు, వాటి దర్శకులు, హీరోలు హీరోయినుల పేర్లు పుస్తకం మూడో అట్టమీద ఉన్నాయి; భీశెట్టి పొందిన బహుమతుల వివరాలు రెండో అట్ట మీద ఉన్నాయి. బర్మాలోని ఆంధ్రులు ఎల్లలు దాటిన తెలుగు మల్లెలుగా అభివర్ణించిన ఈ పుస్తకం, తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహకారంతో వెలువడింది. దర్శకరత్న దాసరి నారాయణరావు, నటసమ్రాట్ అక్కినేని నాకేశ్వరరావు చెరోవైపునా వున్న భీశెట్టి లక్ష్మణరావు బొమ్మ పుస్తకం తెరవగానే మనని పలకరిస్తుంది. బర్మా ఆంధ్ర ప్రముఖులలో ఒకరైన కె గంగిరెడ్డి (విశాఖపట్నం డాక్ లేబర్ బోర్డ్ యడ్మినిస్ట్రేటివ్ బాడీకి ప్రెసిడెంట్), ఈ పుస్తక ప్రచురణకు అయిదువేలు విరాళ మిచ్చారు.

లక్ష్మణరావు రంగూన్‌లో పుట్టారు; 'పెద్దబాలశిక్ష' అక్కడే చేత బట్టారు; తెలుగు వారి 'బాలానందం'లో పాల్గొన్నారు; రంగూన్ నుంచి వెలువడే 'ఆంధ్రమిత్ర' లో మొదటి కథ అచ్చయింది. పద్దెనిమిదేళ్ల పాయాన జీవన స్రవంతిలో అంతర్భాగమైన చిన్న నాటి జ్ఞాపకాలతో, ఆ పుట్టిన చోటు వొదిలి, తాతముత్తాతల దేశానికి రావలసి వచ్చింది. ఇందులో పౌరసత్వానికి సంబంధించిన పేచీలు కొన్ని లేక పోలేదు - అవి చాలా జటిలమైనవి. పైకి కనిపించేటంత తేలిక కాదు.

లక్ష్మణరావు వంటి 'నవీన కాందిశీకులు' అనేక ప్రదేశాలలో వున్నారు. సంస్కృతీ పరిరక్షణ వేరు; పౌరసత్వపు హక్కు వేరు. Be a Roman in Rome అనే పాతకాలపు మాట ఈ అత్యాధునిక యుగంలో కూడా వర్తిస్తుంది. బర్మాలోని ఆంధ్రప్రముఖులు, ఆంధ్రాలోని బర్మా కాందిశీక సంఘాలు యిలాటివన్నీ చెప్పారు. పాతికముప్ఫయ్యేళ్ల క్రితం బర్మాలో వున్న ఆంధ్రుల సంగతే గాని నేటి పరిస్థితులు అంతగా తెలిసినట్టు తోచదు. మారిషస్‌లోను, యితర దేశాలలోను వున్న ఆంధ్రుల ప్రస్తావన యిక్కడ అనవసరమేమో కూడా.

'మాకొద్దీ తెల్లదొరతనం' (గరిమెళ్ల) ఒకనాటి రాజకీయ చైతన్య కారకమైతే, 'రంగమెళ్లిపోతానే నారాయణమ్మా' అనేది ఒకనాటి సామాజిక స్థితికి దర్పణం. 1948 జనవరి 4 వ తేదీన బర్మా స్వతంత్ర రాజ్య

రెండవ వారు ఫిడీలు విద్వాంసులు. తంత్రుల మీద అంగుళీ నృత్యమును చేయించి, సంగీత సుధను ఉత్పన్నము చేస్తారు. అంగుళీ స్పర్శ సుధను క్రోలమని అందిస్తారు మరొక చేతితో.

మరొకరు మృదంగ విద్వాంసులు చర్మము మీద లయను పుట్టించి రాగముతో జంటగ విహరిస్తారు. శివతాండవ ఢమరును స్మరణ వనమునకు తెప్పిస్తారు. తాళ మాధుర్య అమృత శీకరముల మనపై కురిపిస్తారు.

ఇంకొకరు నాదస్వర కోవిదులు. ఎన్ని శుభకార్యములకు మేళము అందించారో, ఎందరు నవదంపతులకు సంగీత సురటుల వీచినారో, ఎన్ని గృహ ప్రవేశములో, ఎన్ని శోభాయాత్రలో! అలంకృత ఉత్సవ విగ్రహాల ఊరేగింపులో! ఎన్ని తిరునాళ్లో! ఏమి ఉన్నా లేకపోయినా, మేళము ఉండాలి గదా శుభ కార్యానికి.

చివరి వారు నాట్యాచార్యులు. రాగ తాళములకు అనువుగ, యువతులకు నృత్యము నేర్పేవారు, చేతులలో అడుగులలో ఎంత నైపుణ్యము, సొగసు దాగియున్నదో చూపించేవారు. కంటి చూపులలో ఎంత ఒయ్యారము, వేడి, తీపి కలిసియున్నదో తెలిపేవారు, చక్కగ నడిచే బాలల కుంచిళీ పాదములతో, రమ్య విన్యాసములతో, హస్త ముద్రికలతో మౌన విలాసినులుగ మార్చేవాడు, ప్రేక్షకులను మంత్రముగ్ధులుగ చేసేవాడు, సౌందర్య తరంగములతో, కళా సాగరమును సృష్టించేవారు, చలిత పుష్ప ప్రదర్శన భ్రమను పుట్టించే సౌందర్య సుధను పంచిపెట్టి అనిమేషుల చేసేవారు. నాట్యాచార్యుల జన్మభూమి కూచిపూడి కళాధామముగ వెలసింది. పవిత్ర తీర్థముగా నేను పలు మారులు దర్శించాను.

అందరు బహుళ ప్రచారమును పొందినవారు. దేశములో పరదేశము లలో ప్రఖ్యాతిని సన్మానములు పొందినవారు.

త్యాగరాజు మూల విరాట్
విద్వాంసులు ఉత్సవ విగ్రహాలు
వారు లేవిదే వీరు లేరు
వారి సుగంధాన్ని, వీరు వ్యాపింపచేసే
మలయ మారుతాలు, పరస్పర ఆశ్రితులు,
వారికి సహస్ర కర్పూర నీరాజనాలు
వీరికి శతమానం భవతి అంటూ
సహస్ర శుభాకాంక్షలు, అభివాదాలు.

(5-9-1992 తిరుపతిలో చేసిన ప్రసంగ సారాంశము)

సైన్స్ ఫిక్షన్

# జూలియస్

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ: డాక్టర్ మల్హోత్రా, సునీత, షార్మా, రాజేష్‌లు. తప్పి పోయాడనుకున్న జూలియస్‌ని వెతుకుతూ వచ్చి, అతని స్పేస్‌షిప్‌లో బందీలయారు. విస్ఫోటనగా, నిద్ర మత్తుతో వున్న ఆ నలుగురికీ ఈ అంతరిక్ష నౌక తమని ఎక్కడికి తీసుకు వెళ్తున్నదో తెలియదు.... ఇక చదవండి

నిద్ర చోటెరుగదు;.... ఆకలి రుచెరుగదు - అన్న సామెతలాగ.... ఆకలి భాధ ప్రస్తుతానికి లేకపోయినా నిద్రముంచు కొచ్చేసింది.... అలాగే పడుకున్నారంతే....

"స్పేస్‌షిప్.... ఎర్త్ మాగ్నెటిక్ ఫీల్డ్ దాటి వెళ్ళలేక పోతే మాత్రం. న్యూటన్స్ లా ఆఫ్ గ్రావిటేషన్ పాఠం స్వయంగా నేర్చుకుంటామన్న మాట.... అంతలా ఓ కునుకు తీస్తే ఎందుకైనా మంచిది.... బేబీ... కమాన్ ... మనిషికి దేవుడిచ్చిన వరం నిద్ర!. అంతే కాదు, ఎంత బాధలోనైనా.... దివ్య ఔషధంగా. పని చేస్తుంది.... కమాన్.... కాసేపు నిద్ర పోవడానికి ప్రయత్నించు. కాగల కార్యములు గంధర్వులే తీర్చగలరు" అంటూ కోటు విప్పి క్రింద పరుచుకొని, తను నిద్ర కుపక్రమించాడు మల్హోత్రా.

5

స్పేస్‌షిప్ గోడ నాను కొని మోకాళ్ళ చుట్టూ చేతులేసుకొని ముడుకుల మీద తలవాల్చుకొని కళ్లు మూసుకుంది సునీత.

ఆ యువతి మనసులో ఏ భావమూ లేదు. డెత్ సెంటెన్స్ ఇచ్చాక.... మృత్యువును కౌగలించుకొనే ఆ క్షణం కోసం ఎదురుచూచే ఖైదీలాగ భావరహితంగా వుంది మనసు.

కళ్ళ మీదకు నిద్ర రాలేదు....

మనసు, శరీరము అలసిపోతే ఒక్కసారి... నిద్రకు విశ్రాంతికీ అతీతమై పోతుంది... అలాటి విచిత్ర స్థితిలో కాసేపు కొట్టు మిట్టాడి, గడ్డం మోకాలిమీద ఆన్చి... కళ్ళెత్తి, నిద్ర పోతున్న మిత్రత్రయం మీద క్షణ కాలం నిలిపింది చూపు.

విభిన్న దృక్పథాలు, జీవన విధానాలు కలిగినా, స్నేహానికి మారుపేరుగా మసలే ఆ ముగ్గురినీ పసిపాలను తదేకంగా చూచే తల్లిలా చూచింది.

రేపన్నది... మన జీవితంలో వుందా ?.... వుంది. ఏరూపంలో... ఎక్కడ... అసలెంత కాలం ఈలాగ!

తల్లి చనిపోయాక... తను ఒంటరిదై పోయినా మేనమామ ప్రేమాభిమానంతో. మనిషిగా నిలబడగలిగింది. భావి జీవితం గురించి తన కంటూ ప్రత్యేకమైన ఆలోచనలు గానీ నిర్ణయాలు కానీ లేవు... తను ఆనాడు, ఈనాడు. మరి ఏనాడూ ఏకాకి గానే మిగిలిపోవచ్చు.

కానీ... జీవితంలో... స్థిరపడి... ఎంతో పేరు ప్రతిష్ఠలను గడించి... ప్రపంచానికి ఇంకెంతో మేలు చేయ సమకట్టిన... మిత్రులు ముప్పురూ... వారివారి కుటుంబాలకు దూరంగా... కబురైనా అందించలేని భయంకర స్థితిలో... అపై ఆలోచించడానికి మనసు మొరాయించింది.

ఫేట్ కానీ....డెస్టినీ కానీ.... ఏది ఏమైనా అ విధి చేత చిక్కిన కీలు బొమ్మలు తాము.

క్రొత్త సంవత్సరంలో అడుగు పెట్టి సంగ, ప్రపంచం నిండా ఓ రోజైనా పూర్తి చేసుకోలేదు.... మరో సగం ప్రపంచం పాశ్చాత్య దేశాలు ఇప్పుడిప్పుడి సంభ్రమ సంతోషాలు చేసుకొంటూ వుంటాయి.... కానీ.... తమలో.... ఒకత్రుటిలో.... ఎదురు చూడని విచిత్ర స్థితిలో చిక్కడి.... భవిష్యత్ అటుంచి వర్తమానమే సందేహప్రాయమై పోయింది. వైరాగ్యంతో కూడిన చిరునవ్వు పైకి తన్నుకొచ్చింది.

ఎంత ప్రయత్నించినా నిద్ర కాదు సరికదా కనీసం కంటి రెప్పలు కూడా బరువెక్కలేదు...

ఎటు వెళ్తుందో ఈ స్పేస్‌షిప్.... ఇదేదో కిడ్నాప్ కేస్ కాదు కదా.... లేకపోతే ఏ ఆధారం లేకుండా.... ఏ నాందీప్రస్తావన లేకుండా వున్నట్టుండి తలుపులు మూసుకు పోవడమేమిటి ? ఇన్‌స్టెంట్‌గా టేకాఫ్ చేయడమేమిటి.... రిమోట్ కంట్రోల్ తో నేవిగేట్ చేయబడుతోందా .... ఏంకోరి ఈలా కిడ్నాప్ చేయబడ్డారు తాము. ఏ గ్రహవాసులతో ? అసలు తామేమి సైంటిస్టులూ, వర్ల్డ్ రినౌండ్ స్పెషలిస్టులూ, ఇంపార్టెంట్ పర్సనల్ కాదే....

సర్వ సాధారణ సీదా సాదా, భోలా భీలీ మనుష్యులు. తెల్లవారి లేచి బాయ్‌లోకి చీని కోసం తడుములాడుకొనే కుటుంబాలు....

ఏం జరిగింది ?.... ఇంతకూ ఈ జూలియస్ అని పిలువబడే ఇతను వ్యక్తేనా.... రక్త మాంసాలున్న మనిషేనా ? లేక, కంప్యూటరైజ్డ్ రోబోటా ? గుండె ఫీబుల్‌గా కొట్టుకొంటూందని మామయ్య అంటారే? మనిషి కాకపోతే రాత్రి అంతగా తన పియానో మ్యూజిక్‌ను తెగమెచ్చుకున్నాడే.... మెషీన్‌కు అంతటి పరిజ్ఞానం వుందా ?

కళ్ళలో కళ్ళు పెట్టి చూచిన ఆ క్షణంలో.... ఆ చూపుల్లో ఎంత వేడి .... ఎంత వాడి.... ఎంత ఆప్యాయత

.... మెషీన్ ఈలాటి ఫీలింగ్స్‌తో రియాక్ట్ అవుతుందా!

కొన్ని గంటల క్రితం తాము ఇరువురూ వాకింగ్ వెళ్తున్నపుడు చుట్టుపట్ల టూరిస్ట్ ప్లేసెస్ చూడాలన్న కాంక్ష జూలియస్ వెలిబుచ్చలేదూ?.... దగ్గరగా జరిగి తన నడుం చుట్టూ యథాలాపంగా చేయిచుట్టి మాట్లాడుతుంటే... ఆ మాటల్లో ఎంత అభిమానం!....

విదేశీయులకు.... ఆడపిల్ల నడుం చుట్టూ... చేయి వేసి ఆలా చెట్టాపట్టాగా నడవడంలో అర్థం, స్నేహం ఓ అడుగు ముందుకేసినట్టని తనకూ తెలుసు.... పోనీ, అతిథి కదా అని సరిపెట్టుకుంది.... తాను.... కానీ అంతరిక్షవాసులకు.... ఈలాటి అనుభూతి, కోరిక, కాంక్షలు వుంటాయా? జూలియస్ నిజంగా గ్రహాంతర వాసా? .... లేక విదేశీయుడై వుండీ క్యూరియాసిటీ కొద్దీ తమలాగే.... ఆ నౌకలో అడుగుపెట్టి కారణాంతరాలవల్ల అపస్మారక స్థితిలో పడిపోయాడా లేక ప్రమాదానికి లోనయాడా? విషపురుగేమైనా బాధించిందా! ఏం జరిగింది?.... ఈ మిస్టరీ.... ఎవరు ఛేదించగలరు? ఎవరు తమను ఈ సంకట పరిస్థితి, ఈ జీవన్మరణ సమస్య నుండీ విడిపించగలరు! ఎవరు దిక్కు?.... ఏది.... దారి! తేనెతుట్టెలా.... ఆలోచనలు చుట్టుముట్టి బాధిస్తోంటే, తలపైకెత్తి తాము బంధించబడ్డ ఆ డెత్‌ట్రాప్‌ను యథాలాపంగా గమనించడంలో మునిగిపోయింది....

చుట్టు గుడిసెలాగ.... గుండ్రని బేస్, సాసర్‌మీద బోర్లించిన కప్పలాగ వుందనిపించింది. పొడగరి అయిన మనిషి చేయి చాపితే అందేలా వుంది పై కప్పు. ఆకుపచ్చ, ఎర్రలైట్లు వెలుగుతూనే వున్నాయి. అయినా ఒక్కసారి ఆరిపోతూ, ఒక్కసారి వెలుగుతున్నాయి ఇంకా ఇంధనం అయిపోలేదా?.... ఎంతసేపు వుంటుందీ రోమాంచిత పరిస్థితి? .... గోడలమీద సునిశితంగా పరిశీలిస్తూండిపోయింది.

ఫ్లోర్ నుండీ మీటరున్నర ఎత్తులో, స్పేస్‌షిప్ గోడలో.... ఏదో మార్పిడి.... అస్పష్టంగా అవుపిస్తూ... సునీత చూపును ఆకర్షించింది....ఒక్కో దిక్కుకు రెండేసి కిటికీలు.... ఆ కిటికీల నుండీ వెలుతురు!.... ఒక్క ఉదుటున లేచి కిటికీకి దగ్గరగా నిలబడింది. విచిత్రం.... వెలుతురు లోనికి వస్తోంది.... పొలరాయిడ్ అద్దాల లోంచి చూచినట్టు.... కంటికి ఏ మాత్రం స్ట్రెయిన్ కల్గించని విధంగా చల్లని అనుభూతి....

ఏవైపు కిటికీలో వెలుతురు అవుపిస్తే ఆ వైపు వెళ్ళి బైట ప్రపంచాన్ని చూడ్డానికి ప్రయత్నిస్తోంది సునీత.

సూర్యోదయం అయిందా!.... లేకపోతే ఎక్కడిదీ వెలుతురు?.... గదిలో కూడా లైట్లు ఇదివరకులా డిమ్‌గా వెలగడం లేదు.

గోడల్లో అక్కడక్కడ చిన్నచిన్న బటన్స్ లాటివి గమ్మత్తుగా మెరవ

సాగాయి. అవి ఎందుకలా మెరుస్తున్నాయో అర్ధంకాలేదు సునీతకు.... కాని ఒకటి మాత్రం అర్ధమైంది.... అంతరిక్ష నౌక భూమి చుట్టూ పరిభ్రమిస్తోంది.... అందుకే సూర్యోదయానికి ఆనవాలుగా వెలుతురు.

రానురాను కుడ్యాలలోని కిటికీల గుండా చిన్న వెలుతురు.... స్పేస్‌షిప్ అంతర్భాగాన్ని కాంతివంతం చేసింది.

ఆ కిటికీలలో గుండా బైట దృశ్యాలు మరో అద్భుత ప్రపంచంలో అడుగిడినట్టు అనుభూతిని ఆశ్చర్యాన్ని ఆహ్లాదాన్ని కలుగజేశాయి.

## 6

ఆ అనుభూతిని తానొక్కతె అనుభవించి పంచుకోవడం ఇష్టంలేదన్నట్టు .... ఇంకా నిద్రిస్తున్న మేనమామ దగ్గరకు జరిగి మోకాళ్ళమీద కూర్చొని "మామయ్య.... మామయ్య" అంటూ చిన్నగా తట్టిలేపింది....

అటునుండీ ఇటు దొర్లి.... ఊ అని మూలిగి "అమ్మా పేటీ.... కాఫీ ...." అంటూ గొణిగాడు.

మేనమామ కాఫీ అని అడిగేసరికి ఒక్కసారి ఇల్లు గుర్తొచ్చింది.... బెడ్ కాఫీ ఐదుగంటలకు త్రాగడం అలవాటు డాక్టర్ మల్హోత్రాకు.... ఆపై ప్రత్యూషవేళ మంచుతో తడిసిన కొండ దారుల వెంట స్వచ్ఛమైన గాలిని గుండెల నిండా పీల్చుతూ వ్యాహ్యాళి వెళ్ళడం అలవాటు. తను ఆ ఇంట లేనప్పుడు ఏలా జరిగినా, తను వచ్చాక తనే స్వయంగా.... ఓ కప్పు కాఫీ తయారుచేసి తీసుకెళ్లి అందించేది.

మనసులో చెలరేగిన అలజడిని దాచుకొంటూ. "మామయ్యా...లేవండి .... ఇదో ఈ విచిత్రం చూడండి" అంటూ తట్టి లేపింది.

లేచి కూర్చొని "ఇదేమిటి ? నేల మీద పడున్నాను.... అరె, వీళ్ళంతా కూడ ఈలా పడున్నారు.... ఏమిటి రాత్రి చాలా సేపు మేల్కొని. "బూజ్" చేశామామ్మా ? వాట్ బేబీ" అన్నాడు....

నిద్ర లేమితో ఎర్రవారిన కనుల నెత్తి సునీత ముఖంలోకి చూస్తూ.

దిగులుగా నవ్వి.... "లేదు మామయ్యా, ఆలాటిదేం జరగలేదు... బహుశా మీకు నిద్రమత్తు తగ్గలేదు .... వి ఆర్ ట్రాప్‌డ్ ఇన్ యాన్ అన్‌నోన్ స్పేస్ షిప్. గుర్తు తెచ్చు కొండి !" అంది ప్రక్కనే చతికిల పడుతూ.

ఒకే ప్రక్కగా పడి నిద్రపోవడంతో మొద్దుబారినట్టున్న భాగాన్ని చేత్తో రాసుకుంటూ... "ఎస్, బేబీ.... యూ ఆర్ రైట్... నా కసలు ఏమీ గుర్తు రానంతగా నిద్ర పోయాను. అరె.... ఇదేమిటి... ఈ వెలుగులు : హూమ్" .... అంటూ లేచి ఆసక్తిగా చుట్టూ చూడ సాగాడు మల్హోత్రా.

అప్పటికి నిద్ర తేలిపోయిన కాంతి దేవ్ షార్మా, రాజేష్‌లు కూడా బద్ధ కంతో ఒళ్లు విరుచు కొంటూ అటూ ఇటూ మసలి, క్రిందపడి నిద్ర పోయి నందుకు తిట్టుకొంటూ, లేచి కూర్చొని. అంతలో రాత్రి జరిగి పోయిన ఘోరమైన సంఘటన గుర్తుకు రాగా మౌనంగా వుండి పోయారు ....

"కమాన్ ఫ్రెండ్స్.... సీ దిస్ వండర్.... దూరాన నీలి ఆకాశం.... ఆకాశంలో తేలితేలి పోయే మబ్బులు. ఆ మబ్బులకు చాలా చాలా దూరంగా నీలి రంగులో వెండి పొదిగినట్టు.... ఓ అందమైన జువెల్. ప్రెషస్ అండ్ మోస్ట్ వండ్రఫుల్ జువెల్.... ఆకా శంలో అర్ధవృత్తాకారంలో అంత కంతకూ దూరమౌతూ అవుపిస్తూంది" అన్నాడు.... సంభ్రమంగా మల్హోత్రా.

కోరగా చూచి.... ముఖం తిప్పేసు కున్నాడు రాజేష్.... మ్లానవదనంతో తలెత్తి చూశాడు షార్మా.

"బేబీ....ఆ జువెల్ మనదేనమ్మా... అదే మన జన్మభూమి.... అదే ఎర్త్... సౌరకుటుంబంలో మూడవ గ్రహం.... అటు చిన్నదీ కాక మరీ పెద్దదీ కాక ప్రాణికోటి పుట్టి పెరగడానికి అను కూలమైన వాతావరణం.... శీతోష్ణ స్థితి, స్వచ్ఛమైన గాలి, నీరు, రత్నగర్భ. బంగారాన్ని పంటల రూపంలో ఇచ్చే మట్టి. తీయని రకరకాల పళ్లను ఆయా ఋతువుల్లో మానవునికి అందుబాటులో వుంచే కమ్మని తల్లి.... పుడమితల్లి ! చూడు, అంతకంతకూ దూరమై పోతోంది. పోతూ పోతూ.... సౌర కుటుంబంలో ఒక కుటుంబ సభ్యుడిగా మిగులుతూ అవుపిస్తోంది.

(ఇంకా వుంది

